త్వరలో వచ్చుచున్నది!

# కాంచనద్వీపం

రాబర్ట్ లూయీ స్టీవెన్సన్



రామమోహనరావు

వెల రూ. 1 80

ఖర్చుల ప్రత్యేకం

ఆంధ్ర గ్రంథమాల,

మద్రాసు 1.

# భారతి

[సచిత్ర మాసపత్రిక]

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



ఆంధ్రపత్రికా ముద్రాలయము
మదరాసు.

సంపుటము 29 ఏప్రెల్, 1952 సంచిక 4

విడిప్రతి వెల ఒకరూపాయి

# త్వరలో వచ్చుచున్నది!




ఈ కథ 1547 వ సంవత్సరంలో ఇంగ్లండులో జరిగినట్టు వ్రాయబడింది. ఆ రోజుల్లో ఇంగ్లండు దేశంలో ప్రజలు ఎలా జీవించేవారో, వారి ఆచారవ్యవహారాలు, కష్టసుఖాలు ఎలాంటివో ఈ నవలద్వారా బాగా తెలుస్తాయి

అనువాదం.

నండూరి రామమోహనరావు

## ఆంధ్రగ్రంథమాల,

మద్రాసు-1.



# విషయ [illegible] క

## ఏప్రిల్



త్రివర్ణ చిత్రము—పితృహృదయం (హిమవంతుడు-గౌరి) చిత్రకారుడు: మొక్కపాటి కృష్ణమూర్తిగారు

---



తెల్లగా
ఉతుకబడినవి
ప్రకాశవంతముగా
ఉతుకబడినవి
ఇందుకు
సన్‌లైట్
సబ్బు
కారణము
SUNLIGHT



నందన
చైత్రము

# భారతి

సంపుటము 29
సంచిక 4

# ఉగాది



శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు

మానస హంసమా! కదలుమా! అదిగో మన 'నవ్య నంద' నో
ద్యానవనంబు, కమ్మని లతా సుమపత్ర ఫలాననంబు,
మేధానిధులైన పెద్దలు సుధామధురోక్తులతో నొసంగు స
న్మానము లందికొన్నది సుమా? అనుమానము లేదు వ్రాలుమా!

తీయని నీరు పారెడి నదీతటిఁ జల్లని పిల్లగాలిలో
హాయిగ సేయవచ్చును విహారము, చిక్కని కల్ప భూరుహ
చ్ఛాయల విశ్రమించి వినఁ జాలెద వింపుగ గున్నమావిపై
కోయిల కన్నియల్ వలపుఁ గుల్కుచుఁ బాడెడు జాలిపాటలన్.

మేలి పసిండి వన్నియల మించిన మేనుల నాలుకాలముల్
రాలుచుఁ దేలుచుండు ఫలరాసులు 'రాసులు' గోచరించు-ఈ
వాలుగరమ్ము లెమ్ము తెలవారుచు నున్నది-రాజనాలు ము
త్యాలల రారు చుండును గదా? 'నవనందన' గర్భ సీమలన్

ఆరగింతువు గాక నోరూరు రుచులతో
నోల లాడెడి రాజనాల పంట
అనుభవింతువు గాక యమృత మాధురి మించఁ
జవులూరు కామధేనువుల పాఁడి
ఆనుచుందువుగాక నానాలతాపత్ర
సుమపరీమళ ఘుమం ఘుమల హాయి
విశ్రమింతువు గాక విమల గంగానదీ
సైకతస్థలములఁ జల్లగాలిఁ

గాంచెదవుగాక కన్నుల కఱవు దీరఁ
గ్రమ్మకొని మేలుఁ గూర్చుయోగముల మహిమ
కదలు మెదురౌనదే శుభగ్రహ మయంబు
నవకళాసదనంబు, 'నందన' వనంబు

కోమలమై, ఫలసస్య
శ్యామలమై, సత్యకాంత శమదమ గుణ సం
ధామంబై, 'నందన' వన
సీమ, సమస్త ప్రజేష్టసిద్ధుల నొసఁగుఁ



# ధరల తగ్గుదల



శ్రీ పి యస్ ప్రకాశరావు

ఈ నెలనాళ్లలో తలవనితలంపుగా దేశమంతటా అన్ని వస్తువులకు (కొన్ని కంట్రోలు వస్తువులకు తప్ప) ధరలు పడిపోయాయి. కొంచెం ఎరిగి పడినంత తీవ్రంగా యీ ఒడుదుడుకు సంభవించడంచేత, వేలాదిబది వ్యాపారులనేకమంది [illegible] అనేకకోట్ల రూపాయల నష్టం సంభవించింది జట్టు, వ్యాపారం, దాదాపు స్తంభించిపోయింది బొంబాయి కలకత్తా మొదలగు చోట్ల సంత బంగారు మార్కెట్లు మొన్న మొన్నటివరకూ మూసివేయబడే ఉన్నాయి మాట నమ్మకంమీద అప్పుసొప్పు తెచ్చి వ్యాపారం సాగించే పెద్ద వర్తకులలో కొందరు ఆ అప్పు ఎగగొట్టారు మరికొందరు వాయిదాపై సరుకు బేరంచేసి, వ్యాపారనీతికి విరుద్ధంగా ఆ సరకు కొనడం విరమించుకోవడమో, కొన్న సరకు డబ్బు యివ్వలేకపోవడమో జరిగింది

ఈ విపరీత పరివర్తనకు మిగతా కారణాల సంగతి ఎలా ఉన్నా, వ్యక్తులలో ప్రధాన కారణమనేది నిర్వివాదం అంతర్జాతీయ రాజకీయ వాతావరణంలో వచ్చిన మార్పుగాని, వ్యాపార రంగంలో వచ్చిన మాంద్యంగాని లెక్కచేయకుండా, కొరియాయుద్ధం నాటినుంచి, లాభాలు గడించడం మరిగి ఆ అలవాటు ప్రకారమే సరకుకొని నిల్వచేశారు ఎంతకాలం ఓపికపట్టిచూచినా తాము కొన్న ధరకంటె ఎక్కువ ధరకు అమ్ముకొనే దారి కన్పించలేదు ఒక్కసారి గుప్పుమన్నది

కించిత్తు దూరదృష్టితో వ్యవహరించి ఉంటే ధరలు అమాంతంగా గాక, మిగతా దేశాలలో మాదిరే క్రమేపీ తగ్గడానికి అవకాశముండేది కొరియాయుద్ధంలో పెరగడం ప్రారంభమై 1951 ఏప్రిల్, మే నెలల్లో ఆకాశాన్నంటిన ధరలు 51 జూన్ నెలాఖరులో సోవియట్ రష్యా కొరియాయుద్ధవిరమణ ప్రతిపాదించిన క్షణంనుండీ కొంచెం తగ్గుముఖం చూపాయి ఈ ప్రతిపాదన వచ్చిన మరునాటికే, వివిధదేశాలలో యుద్ధావసరమైన ముడిసరుకుల ధరలు ఒక పెట్టు దిగాయి

చైనాపై దాడిచేసి ప్రపంచయుద్ధం తెచ్చిపెడతాననుకొన్న జనరల్ మెకార్థర్ బర్తరఫ్ కావడం, ఆ తరువాత కొరియాలో యుద్ధవిరమణ జరగడం, పాన్‌ముంజాం లో సంధిసంప్రదింపులు ఫలిస్తాయని పదేపదే అమెరికన్ నాయకులు ప్రకటిస్తూండడం వీటన్నింటివల్ల కొరియాలో తిరిగియుద్ధం రాకపోవచ్చునని, అనగా వచ్చినా మునుపటంత భారీ ఎత్తున జరగదని ఒకవిధమైన నమ్మకం యేర్పడింది. కొరియాయుద్ధమూ, దాంతోపాటు, అంతర్జాతీయ ఉద్రిక్తత వెనుకపట్టడంతో, యుద్ధావసరాల నిమిత్తం అయినకాడికి తెగబడి సరుకులు కొనటం అమెరికా తగ్గించింది ఆర్థిక చిక్కులవల్ల బ్రిటన్ కూడా అమెరికాను అనుసరించింది పైపెచ్చు యీ ఉభయ దేశాలు, లోగడ తాము కొన్న ముడిసరుకులను, వస్తువులను, తిరిగి అమ్మివేయడం కూడా సాగించాయి. ఏ సరకైనా, ఎంత ధరైనా మిగతా దేశాలకు అందకుండా కొని నిల్వచేసే అమెరికా మార్కెట్ పోటీ నుంచి తప్పుకొనడంతో సరకులకు గిరాకీ తగ్గటం సహజం దీనికితోడు ముఖ్యావసరమైన ముడిసరకుల ఉత్పత్తి కూడా హెచ్చింది 1950 - 51 కంటె 51 - 52 లో రాగి 5%, ఇనుము ఉక్కు 10%, బొగ్గు 10% తుత్తునాగం 5% సహజంగా లభించే రబ్బరు 150 వేల టన్నులు, కృత్రిమపు రబ్బరు 8 లక్షల టన్నులు అధికంగా ఉత్పత్తి అయినాయి అటు యూరప్‌లో ఫ్రాన్సు జర్మనీలు, యిటు దూరప్రాచ్యంలో జపాను పారిశ్రామిక దేశాలుగా తిరిగి తల ఎత్తుతున్నాయి కొరియాయుద్ధం మూలంగా బలపడిన జపాను ఉత్పత్తి, యించుమించు రెండవప్రపంచ యుద్ధాత్పూర్వస్థాయికి వచ్చింది ఇలా ముడిసరుకుల సప్లై, పారిశ్రామిక వస్తూత్పత్తి పెరగటంవల్ల ఏ దేశానికాదేశం ఎగుమతి వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోవడానికి దిగుమతులను తగ్గించుకోవడానికి మొదలెట్టాయి

అమెరికా బ్రిటన్లు సహా అనేక దేశాలు చీప్ మనీ పాలసీలకు స్వస్తిచెప్పి, బ్యాంకు రేట్లను పెంచటంతో, మార్కెట్లో పరపతి బిగిసిపోవడం, యూరప్ దేశాలలో వ్యాపార లావాదేవీల చెల్లింపు గడ్డు సమస్యగా తయారవడం యిత్యాదులన్నీ ధరల తగ్గుదలకు దోహదం చేశాయి

1951 ద్వితీయార్థ భాగంనాటి ధరలకు 1952 ఫిబ్రవరినాటి ధరలకు పోల్చిచూస్తే పత్తి ధర 21%

ఉన్ని 59% రబ్బరు 58% జనపనార 60% చొప్పున ధరలు తగ్గిపోయినట్లు స్పష్టమౌతుంది ఈ తగ్గుదల క్రమేపీ సంభవించిందన్న సంగతి గమనించాలి

కాని మనదేశంలో మాత్రం యిందుకు విరుద్ధంగా ఒక్కసారి అమాంతం పడిపోయాయి ఈ పడిపోవడానికి పైన పేర్కొన్న అంతర్జాతీయ వ్యాపార పద్ధతులే గాక, మన దేశపరిస్థితులు కూడా కారణం ఇంతవరకు మనదేశంలో చీప్ మనీ పాలసీ అమలులో ఉండి తక్కువ వడ్డీకి బ్యాంకులు ఎంతకావలిస్తే అంతా రిజర్వుబ్యాంకువద్ద తెచ్చి, లేక ఎప్పుడుకావలిస్తే అప్పుడు ప్రభుత్వ ఋణపత్రాలు అమ్మి వ్యాపారానికి మదుపుపెట్టాయి బ్యాంకులు విరివిగా అప్పులివ్వడంచేత ప్రోత్సహించబడిన స్పెక్యులేషన్ దేశంలో తలయెత్తింది ముడిసరకులలో మొనాపోలీ ఉన్నంతవరకూ అమెరికా భారీ కొనుగోలుదారుగా మార్కెట్లో నిలబడ్డంతవరకూ, యీ స్పెక్యులేషన్ నిరాఘాటంగా సాగింది అటు అంతర్జాతీయ వ్యాపారరంగంలో అమెరికా నక్కి తగ్గడం, యిటు రిజర్వుబ్యాంకు వడ్డీ రేటు పెంచి పరపతిని పరిమితం చేయడం స్పెక్యులేటర్లకు కొంత చిక్కు తెచ్చిపెట్టింది

1951 నవంబరులో రిజర్వుబ్యాంకువడ్డీరేటును 3% నుంచి 3½ %కు పెంచింది అనవసరంగా విరివిగా దేశంలో డబ్బు లభించకుండా చేయడమే యిందలి ఉద్దేశ్యం అవసరమైన వ్యాపారానికి మాత్రమే అప్పులిస్తూ స్పెక్యులేషన్ తగ్గేట్లు చూడవలసిందని కూడా రిజర్వుబ్యాంకు షెడ్యూల్డుబ్యాంకులను ఆదేశించింది షెడ్యూల్డుబ్యాంకులవద్దనున్న గవర్నమెంటు సెక్యూరిటీలను, యిదివరకులా కొనటం జరగదని కూడా రిజర్వుబ్యాంకు స్పష్టం చేసింది ఇక రిజర్వుబ్యాంకువద్ద తెచ్చి, సరకుల హామీపైనైనా, వ్యాపారస్థులకు అప్పులు పెట్టడం షెడ్యూల్డు బ్యాంకులకు కష్టమైపోయింది రిజర్వు బ్యాంకు రేటుతోపాటు బ్యాంకులు కూడా వడ్డీ రేట్లు పెంచాయి దీనికి తోడు, అమెరికా అప్పుగా యిచ్చిన 20 లక్షలగోధుమను అమ్మకంతో, మార్కెట్లో చలామణినుంచి సుమారు 70 కోట్ల రూపాయలు ప్రభుత్వ ఖజానా చేరాయి ఈవిధంగా దేశంలో డబ్బుకు కటకట అయింది అటు అంతర్జాతీయ వ్యాపారంలో మాంద్యం ఏర్పడ్డంచేత మన ఎగుమతి వ్యాపారం స్తంభించిపోయింది ఇంతవరకు మనమొనాపోలీ అనుకొన్న ముడిసరకులలో కూడా విదేశీపోటీ తలయెత్తింది కృత్రిమపునారతో వస్తువులు తయారవడము, నారసంచులకు బదులు కాగితపుసంచులు వాడుతుండడంవల్ల నారవస్తువులకు గిరాకీ తగ్గింది నారవస్తువుల ఎగుమతిపై ప్రభుత్వం పన్ను తీసివేసినా యీ వ్యాపారం పుంజుకోలేదు నారవస్తువులకు గిరాకీ తగ్గుటచేత, ముడినారకు ధర పడిపోయింది పాకిస్థాన్‌లో నిరుడు మణుగు రూ 105 లు అమ్మిననార యివాళ 43 రూపాయలకు యిస్తామన్నా కొనే దిక్కులేక మురిగిపోతున్నది

చైనా అర్జంటీనా తూర్పుఆఫ్రికాల పోటీవల్ల, నూనెల ఎగుమతులపై అమెరికా నిర్బంధాలను తొలగించడంవల్ల, నూనెగింజల వ్యాపారం దెబ్బతిన్నది అమెరికా ఈజిప్టు టర్కీ మెక్సికో మొదలైన దేశాలలో ప్రత్తి విస్తారంగా పండించడంవల్లగా, ప్రత్తి ధర పడిపోయి బట్ట ఎగుమతివ్యాపారం వెనుకబట్టింది ప్రత్తి విషయంలో మరో విచిత్రమేమంటే, ఇండియా యేటా పాకిస్థాన్‌నుంచి ప్రత్తి వచ్చే అవకాశం కన్పించనందున ఎక్కువధరకు అమెరికా ప్రత్తికోసం మన మిల్లులు ఆర్డరిచ్చాయి నిజానికి అడిగినదాంట్లో సగం మాత్రమే దిగుమతి అవడంచేత యీ యేడు కావలసినదానికన్నా రెట్లు ఆర్డరిచ్చాయి ఆర్డరిచ్చినంత దిగుమతి అయింది ఫలితం ఏ కేవులో చూచినా ప్రత్తి మురిగిపోతున్నది ఎగుమతి వ్యాపారానికి కీలా దెబ్బ తగలడంతో యీ సరకుల స్పెక్యులేషన్‌కు అలవాటుపడి అనాయాసంగా కోటీశ్వరులం కావచ్చునని ఆశతో, అధిక ధరకు కొని నిల్వచేసి ఉంచినవారి స్థితి యిరుకున పడింది కొత్త బడ్జెట్‌లో ఎగుమతి పన్నుల భారమేమైనా తగ్గుతుందేమోనని ఆశించారు కాని ఆ ఆశ నిరాశే అయింది ఒకవైపు వ్యాపారం పడిపోవడం, మరోవైపు అప్పులు చెల్లించమని, లేదా యింకా ఎక్కువ సరుకు హామీగా ఉంచమని బ్యాంకులు చేస్తున్న ఒత్తిడిచేయడం, కొత్తబడ్జెట్ ఆశ నిరాశ చేయడం వీటన్నింటికీ తట్టుకోలేక, తమవద్ద నిల్వ ఉన్న యావత్తు సరకును ఒక్కసారి అమ్మకానికి ఎగవెలచేసి తెగ నమ్మజూచారు కాని కొనేదిక్కు లేక ధరలు శరవేగంతో పడిపోసాగాయి ఈ దుస్థితి క్రమేపీ నూనెగింజల వ్యాపారానికి సోకి, వెండి బంగారాలువంటి వివిధవ్యాపారరంగాలకు ప్రాకింది వెండి బంగారాలు ధరలు తగ్గడానికి కారణం, అందులోను స్పెక్యులేషన్ విపరీతంగా ఉండడం, యీ దేశంలో ధర హెచ్చుగా ఉన్నందున విదేశాలనుండి దొంగతనంగా చాలా బంగారం (1951 సం॥లో 630 ఔన్సులు దిగుమతి అయ్యిందట) దిగుమతి అవడం బంగారం ధరతోపాటు వెండిధర తగ్గింది ఈ రెండింటి ధరలు పడిపోవడంతో, స్టాకులు షేర్లుపడిపోయాయి దేశమంతటా పెద్ద కలవరం బయలుదేరింది సహజకారణాలవల్ల కొన్నింటికి ధరలు పడిపోతే, కలవరంవల్ల మిగతావాటి ధరలు పడ్డాయి స్పెక్యులేషన్‌లో పుట్టిన కలవరం

# దేశోద్ధారక వర్ధంతి



ఈ ఏప్రియల్ 6 వ తేదీకి (చైత్రశుద్ధ ద్వాదశి ఆదివారం) విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి వర్ధంతి ఆంధ్రదేశమంతటా జరుపబడింది. కళాప్రపూర్ణుని సాహిత్యోపాసనకు ప్రత్యక్ష ఫలితము 'భారతి' ఆ తండ్రి దీవనలు నిత్యము భారతిని వృద్ధిపొందించుగాక!

సర్వత్రా వ్యాపించింది ప్రతిచోటా కొనుగోలు లేక ఎక్కడి సరకక్కడ స్తంభించిపోయింది కొనుగోలు లేనందున ఆహారధాన్యాల ధరలు, కూడా బాగా పడిపోయాయి

ఈ విధంగా విదేశీవ్యాపారమాంద్యం, మితిమీరిన స్పెక్యులేషన్, బ్యాంకువడ్డీరేటు పెరిగి పరపతి బిగిసిపోవటం అరిపోతున్నామనే కలవరం-పుట్టిన్నంటి సమష్టిప్రభావమే ధరల తగ్గుదలకు కారణం దీనికిది కారణమని విడదీసి చెప్పటం కష్టం

ధరలు తగ్గిపోతుండటం చూచి కొందరు ఆర్థికమాంద్యం వస్తుందని జోస్యం చెప్పారు

1951 సంవత్సరం ప్రథమార్ధం నాటికీ, యిప్పటికీ పోల్చిచూస్తే ధరలు బాగా తగ్గినమాట వాస్తవమే గాని, అవి యింకా కొరియాయుద్ధాత్పూర్వపు స్థాయికి రాలేదన్న సంగతి గమనించాలి స్పెక్యులేషన్ వ్యాపారులు విపరీతంగా పెంచిన ధరలు మాత్రం పడిపోయినమాట అదైనా హోల్ సేల్ స్థాయి సరకులకే గాని, చిల్లర వర్తకం సరకులకు తగ్గలేదు ఈ ఒడుదుడుకులలో యెన్నో కొద్దిమంది వ్యాపారులు నష్టపడటం జరిగింది కాని జనసామాన్యానికి లాభించింది అట్టే లేదు

అంతర్జాతీయ పరిస్థితుల్లో మళ్లీ మార్పువచ్చినా అమెరికా తిరిగి సమరసామగ్రికొనటం ప్రారంభించినా, ఉత్తర అట్లాంటిక్ రాజ్యాల సన్నాహాలు తీవ్రతరమైనా మళ్ళీ స్పెక్యులేషన్ తలెత్తటం, ధరలు పెరగటం తథ్యం ఇప్పుడు లభించిన యీ అవకాశాన్ని వినియోగించుకొని, కొరియా యుద్ధాత్పూర్వపు స్థాయిలో ధరలను స్థిరీకరించటానికి ప్రభుత్వం గట్టిగా ప్రయత్నించాలి

ఆహారం విషయంలో లోటు భర్తీచేసుకోవటానికి గాని పారిశ్రామికాభివృద్ధికి కావలసిన యంత్రసామగ్రి దిగుమతి చేసుకోవటానికి గాని, అనేకకోట్ల విదేశీ ద్రవ్యం అవసరం ఇందుకు ఎగుమతి వ్యాపారం సౌష్ఠవంగా ఉండి యితర దేశాలలో పోటీకి నిలవగలగాలి ఇప్పటికే, మనం తప్ప యింకెవరూ ఉత్పత్తి చేయలేరనుకొన్న ముడిసరకులకు ప్రత్యామ్నాయంగా కృత్రిమపు ముడిసరకులు తయారుచేస్తున్నారు జనుము నీలిమందు వ్యాపారం యిలాగే పాడైంది వస్త్రాలవ్యాపారంలో కూడా జపాను పోటీ తీవ్రం కావటం తథ్యం

విదేశాలలో మన సరకులు అమ్ముడుపోకపోవటానికి ప్రభుత్వం ఎగుమతిపన్నులు విధించటం, సకాలంలో ఆయాదేశాలకు ధారాళంగా కోటాలు నిర్ణయించకపోవటం అని వ్యాపారస్థులు అంటున్నారు ఇందులో కొంత సత్యం ఉండటంచేతనే, యీమధ్య ప్రభుత్వం వేరుశనగపై ఎగుమతిపన్ను రద్దుచేసింది ఉన్నిపై పన్ను బాగా తగ్గించింది ఎగుమతి వ్యాపారాన్ని పోషించుకోటానికి, అవసరమైతే, మిగతా ముడిసరకులపై కూడా ఎగుమతిపన్ను రద్దు చేయాలి పారిశ్రామికంగా బాగా అభివృద్ధిలోకి వచ్చేంతవరకూ మన ముడిసరకులను మనం ఉపయోగించుకోలేక యితర దేశాల కొనుగోలుపై ఆధారపడి ఉండాల్సిందే గదా

వ్యాపారరంగంలో వస్తువుల సప్లై—వాటి గిరాకీనిబట్టి ధరలు నిర్ణయం గాకుండా మార్కెట్టులో యావత్తు సరకూ ఒక్కసారిగా కొని ధరలు పెంచటం, ఒక్కసారిగా విడుదలచేసి ధరలు తగ్గించటం, యీ రకం స్పెక్యులేషన్— ప్రజలకు, మామూలు వర్తకులకు కూడా నష్టదాయకం కావట్టి దేశీయవ్యాపారంలో గాని, విదేశీవ్యాపారంలో గాని యీ స్పెక్యులేషన్ను నిషేధించటం మంచిది

దేశంలో డిఫ్లేషనరీపరిస్థితులు పారిశ్రామాభివృద్ధికి దోహదం కావు నిరుద్యోగం ప్రబలుతుంది వ్యాపారం మందగిస్తుంది కనుక స్పెక్యులేషన్ నిమిత్తం గాక, యథార్థ వ్యాపారావసరాలున్నవారికి సులభంగా పరపతి పుట్టేట్లు చేయాలి ప్రధాని నెహ్రూ అన్నట్లు ఈ ధరల మాంద్యం ఉత్పత్తిపై దెబ్బదీయకుండా చూడాలి ఉత్పత్తి దెబ్బతింటే నిరుద్యోగం ప్రబలుతుంది సరసమైన ధరలకు సమాజంలో ఉన్నవారందరికీ సమానంగా వస్తువులు లభించేటట్లు చేయగలగాలంటే సరిపోయినంతగా ఉత్పత్తిచేయటం అవసరం ఇందుకు ధరలలో తీవ్రమైన ఒడుదుడుకులు లేకుండా, ఒక స్థాయిలో నిలకడగా ఉండటం ఎంతైనా అవసరం

# ప్రపంచ కథా బహూకృతి- ★
# శ్రీ పాలగుమ్మి పద్మరాజు

ప్రపంచ కథానికల పోటీలో పాలగుమ్మి పద్మరాజుగారికి ద్వితీయ బహుమానం వచ్చిందని గత మార్చి 16 వ తేదీ ఆంధ్రపత్రికలో ప్రకటించిన వార్త ఆంధ్రజాతి కంతటికీ మహదానందం కలిగించింది. టాగూరు మహాకవి నోబెల్ బహుమానం అందుకున్న తరవాత మనదేశంలో వాఙ్మయంలో ఎవరికీ ఇంతటి బహూకృతి, గౌరవము లభించలేదు. బహుముఖాలుగా నిరుత్సాహంగా ఉన్న వర్తమానాంధ్రదేశ చరిత్రలో ఈ బహూకృతి ఆంధ్రులందరు గర్వించదగిన విషయం.

అసలీ ప్రపంచ కథానికల పోటీ న్యూయార్కు హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రిక తలపెట్టి నిర్వహించింది. భారతదేశం తరఫున హిందుస్థాన్ టైమ్సు సంపాదకులీ పోటీ జరిపారు. ఆంధ్రదేశం తరఫున ఆంధ్రపత్రికా సంపాదకులీ పోటీ నిర్వహించిన విషయం తెలుగువారందరికీ తెలిసినదే. ఆంధ్రపత్రికా సంపాదకు లేర్పరిచిన నిర్ణేతలు తెలుగు కథల్లో నాలుగు ఉత్తమమైనవని నిర్ణయించి ఈ నాలుగూ మొదట భారతకథలపోటీకి పంపించారు. మొట్టమొదట ఈ కథకులకు నలుగురికీ ఆంధ్రపత్రికా సంపాదకులు నూరేసి రూపాయల బహుమతు లేర్పరచారు. పద్మరాజుగారి గాలివాన మొదట ఈ గౌరవం అందుకున్నది. ఇలాగ భారతదేశంలో అన్ని రాష్ట్రాల వారూ అఖిలభారత కథలపోటీకి నాలుగేసి కథలు పంపించారు.

హిందూస్థాన్ టైమ్సు సంపాదకు లేర్పరిచిన నిర్ణేతలు భారతదేశ కథలన్నిటిలోను రెండు కథలు ఉత్తమోత్తమమైనవని నిర్ణయించి ఈ రెండు ప్రపంచ కథానికల పోటీకి పంపించారు. అఖిలభారత నిర్ణేతలీ రెండింటిలోను 'కళ్లు' అనే కథకు మొదటి బహుమతీ ఇచ్చారు. పద్మరాజుగారి గాలివానకు రెండవ బహుమతీ వచ్చింది. రెండవసారిగా పద్మరాజుగారి కథకు మళ్ళీ వెయ్యి రూపాయల బహుమానం వచ్చింది.

న్యూయార్కు హెరాల్డ్ ట్రిబ్యూన్ జరిపిన ఈ పోటీలో 28 దేశాలు పాల్గొన్నాయి. ఆయా దేశాలలోని ప్రధాన ప్రచురణసంస్థ లీ పోటీ నిర్వహించాయి. మొత్తం దీనికి 58 కథలు వచ్చాయి. ఈ పోటీలో పాల్గొన్న దేశాల అధిక సంఖ్యాక నిర్ణయం ప్రకారం ప్రథమ బహుమతీ నిర్ణయించాలనీ, ఆ నిర్ణయాన్ని అనుసరించి మొదటి బహుమానం 5 వేల డాలర్లు ఇవ్వాలనీ హెరాల్డ్ ట్రిబ్యూన్ నిర్ణయించింది. ఈ పోటీ ఏర్పాటు చేసినది అమెరికా దేశమే కనక అమెరికా కథకులెవరూ దీనిలో పాల్గొనకూడదని హెరాల్డ్ ట్రిబ్యూన్ నిర్ణయించింది. ఇదీగాక ఏ దేశము తన కథకు వోటు వేసుకోకూడదని కూడా ఒక నిర్ణయం జరిగింది.

అయితే 1951 సంవత్సరాంతంలో జరిగిన ఈ పోటీనిబట్టి ఏ ఒక్క కథకు ఉత్తమబహుమతి రాలేదు. అందుచేత రెండేసి ఓట్లు వచ్చిన నాలుగు కథలకు ఈ బహుమతీ సమానంగా పంచారు. 'ఎందుకు' అన్న కథకు ఐర్లండ్ జర్మనీలు ఓట్లు వేశాయి. ఇండోనేషియా పోలెండులు 'అయిదవరోజు' అనే కథకు ఓట్లు వేశాయి. 'ప్రేమ నా చిన్ననాటి కలలు చీల్చివేస్తుంది' అనే కథకు స్వీడన్ డెన్మార్కుల ఓట్లు వచ్చాయి. ఇస్రాయెల్, గ్రీసులు 'నిద్రపోయే సంచీ' అనే కథకు ఓట్లు వేశాయి. ఇందుచేత ఈ కథలు నాలుగింటికీ 1050 డాలర్ల బహుమతీలు సమానంగా పంచారు. మిగిలినవి 14 కథలు. ఈ కథలన్నింటికీ ఒక్కొక్క ఓటు వచ్చింది. పాలగుమ్మి పద్మరాజుగారి కథకు ఆస్ట్రియా ఓటు వేసింది. ఈ పైన ఈ 14 కథలలోను మళ్ళీ ఉత్తమ కథ ఏదో నిర్ణయించవలసిందని మరి ఇద్దరు నిర్ణేతలను ఏర్పాటు చేశారు. మిగిలిన కథ లన్నింటిలోను పాలగుమ్మివారి 'గాలివాన' సర్వోత్తమంగా ఉన్నదని నిర్ణయించారు. అందుచేత మొత్తం 5 వేల డాలర్ల బహుమతిలోను మిగిలిన 8 వందల డాలర్లు పద్మరాజుగారికి బహూకరించడానికి నిర్ణయించారు.

ఈ నిర్ణయాన్ని గురించి పోటీనిర్వాహకులు ఒక ప్రకటనచేస్తూ 'గాలివాన' నిజంగా తీ

పరీక్షలో నిలబడి 14 దేశాల కథలలో ఉత్తమోత్తమ కథగా నిర్ణయింపబడినదనీ, పై నాలుగు కథలకు గెంటేసి ఓట్లు రావడంవల్ల పద్మరాజుగారి కథకు ప్రథమ బహుమతి పంచడానికి వీలులేకపోయిందనీ కేవలం ప్రజాస్వామ్యసూత్రాలనుబట్టి మాత్రమే ఇలాగ నిర్ణయించవలసివచ్చిందని అన్నారు ఈ విధంగా పద్మరాజు 'గాలివాన' జాతీయాంతర్జాతీయాలైన గాలివాన లెన్నో గడిచి ప్రపంచ కథాభిమానుల హృదయాలు మారగొన్నది

## పాలగుమ్మి పద్మరాజుగారు

పాలగుమ్మి పద్మరాజు గారు ఆంధ్రపాఠకులకు చిరపరిచితులే వీరి వయస్సు 36 సంవత్సరాలు ఇప్పుడు వీరు భీమవరం కాలేజీలో కెమిస్ట్రీ లెక్చరరుగా పనిచేస్తున్నారు బెనారస్‌లో ఎం ఎస్ సి చదివారు అటుతరువాత కొంతకాలం పిఠాపురం రాజా కళాశాలలో పనిచేశారు

చాలాకాలంనించి వీరు కథలేగాక కవిత, నాటికలు, వ్యాసాలు, విమర్శలు మొదలైనవెన్నో రచిస్తున్నారు వీరి ఖండకావ్యాలు కొన్ని సుప్రసిద్ధ సారస్వత పత్రికలు ప్రకటించాయి పురిటిపాట, రాగి విమానం మొదలైనవి వీరికవిత రచనల్లో ముఖ్యమైనవి చక్కని నిరాయితీ, విస్పష్టత, వీరి కవితలో ప్రత్యేక గుణాలు వీరి కవితా రచనచాలా స్వతంత్రమైన పంథాలో నడిచిపోతుంది అగ్రగామి కవితామార్గంలో వీరిది ప్రత్యేక వ్యక్తిత్వం ఉన్న కవిత చాలాకాలం కిందటే వీరు అరవిందుని *'Love and Death'* అనే కావ్యం కూడా అనువదించారు

ఇంతకుపూర్వం వీరు ఆంధ్ర వారపత్రికలో టర్జినీవ్ వ్రాసిన ఫాదర్స్ అండ్ సన్స్ అనే నవల తెలుగులోకి అనువదించారు ఇలాగే ఇంకా ఒకటి రెండు చిన్ననవలలు కూడా వీరు భాషాంతరీకరించారు ఇంతకుపూర్వం వీరురచించిన కథలన్నీ 'కూలిజనం' అనే పేరుతో ఇంతకుపూర్వమే వెలువడ్డాయి

ఒకసారి ఆలిండియారేడియోవారు జరిపిన రేడియో నాటికల పోటీలో కూడా వీరికి బహుమతి వచ్చింది ఈయన రచించిన నాటిక లొకటి రెండు ప్రదర్శించారని కూడా తెలుస్తున్నది

ఇలాగ వీరి రచన ఎక్కువగా బహుముఖాలుగా సాగినా నవలా, కథారచనలో వీరికి ఎక్కువ అభినివేశం ఉన్నట్టు కనబడుతుంది పద్మరాజుగారు రచనలో ఎక్కువగా వాస్తవిక పద్ధతి అవలంబిస్తారు వీరి రాజకీయదృక్పథం మానవతావాదం (*Humanism*) వైపు బాగా మొగ్గుతుంది

## గాలివాన

దేశీయ విదేశీయ విమర్శకుల మన్ననలందుకున్న వీరి కథనుగూర్చి వేరేప్రత్యేకంగా వ్రాయవలసినపనిలేదు ఈకథపూర్వం ఆంధ్రపత్రికలోనే గాక ఇటీవల ఏప్రిల్ 19వ తేదీ ఆంధ్ర వారపత్రికలో కూడా పడింది అందుచేత తెలుగు పాఠకులందరికీ ఈకథ సుపరిచితమైనదే

ఈ కథలో రావు మానసతత్త్వము ముఖ్యమైనది మనిషి మనస్తత్త్వము పాఠకులకు చాల సునిశితంగా గ్వనిస్తాయి రావు ఒక సూత్రబద్ధంగా నడిచిపోయే వ్యక్తి గాలివానలో ఇతని సూత్రాలన్నీ పటాపంచలైపోతాయి ఇంతటప్పుడు ఇతనిలో మానవత్వం స్ఫుటంగా వికసిస్తుంది కథముగిసేసరికి రావుతోబాటు పాఠకులకు కూడా ముచ్చటపడుతూ ఏకాంతంగా జీవించే మనిషిగాడే ఎక్కువగా సానుభూతికలుగుతుంది గాలివానతాకిడికి మానవుల మనస్సులలో కట్టిన్న బాహిరసూత్రాలు—తెగిపోయేవిధాను కథ ప్రారంభంనుంచీ మనకువ్యంగ్యంగాస్ఫురిస్తూనే ఉంటుంది ఈ కథలో శిల్పము, సంఘటన, ప్రధానభావము ఒకేమూసలో కరిగిపోసినట్లు చక్కని సమన్వయంతో నడిచిపోతూంటాయి

నేటి తెలుగువాఙ్మయం ఏశాఖలోను తదితర భారత వాఙ్మయాలకు తీసిపోదనీ, కొన్నింటిలో ఇదే అగ్రస్థానం వహించగలదనీ బహు భాషావేత్తలైనకొందరు విమర్శకులంటున్నారు పద్మరాజు గారి కథ భారత భాషల్లోనే గాక ప్రపంచభాషల్లో కూడా తెలుగుభాషకు గౌరవం సంపాదించింది

దరిదరిగా అర్ధశతాబ్దంనించి తెలుగులో వెలువడిన ఉత్తమకథలు కొన్ని ఆంగ్లభాషలోకీ భారతీయ భాషల్లోకీ అనువదించబడినట్లైతే నేటి తెలుగు కథా స్వరూపం విదేశీయులకు స్పష్టంగా అవగాహన కాగల అవకాశాలున్నాయి ఈ బహుమతి ఇటువంటి ప్రయత్నానికి బాగా ప్రోత్సాహం కలిగించగలదని ఆశిస్తున్నాను

పద్మరాజుగారింకా యువకులే క్రమంగా వీరు ఆంధ్రులకు నోబెల్ బహుమాన గౌరవంకూడా సంపాదించగలరని ఆశిస్తున్నాను

'శాస్త్రి'

# యజ్ఞఫలము

భాసమహాకవి సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణము

## శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

(గత సంచిక తరువాయి)

### విష్కంభము !!!

(ముగ్గురు ఋషి శిష్యులు ప్రవేశింతురు)

మొదటి

"బ్రహ్మఋషి యైన కౌశికుని క్రతువు వేడ
పూర్తియైనది కామ్యసంపూర్తి నగుచు,
తత్ఫలంబుల నిర్భయత్వంబుతోడ
మనుచు మనమంటిమి సత్తపోవనమునందు"

రెండవ మిత్రమా! శాలంకాయనా! ఈ యజ్ఞఫలము శుభప్రదమైనది నీవన్నట్టిక నిర్భయముగా మనము తిరుగగలము

శాలం గాలవా! ఈ తపోవనమున మారీచుడు మున్నగు రాక్షసులు విశ్వామిత్రాదులను దక్క మనవంటివారి జోలికి రాకపోయినను మనకు మిక్కిలి భయముగా నుండెడిది

మూడవ విశ్వామిత్రాదులనే కాని యజ్వలను వారేల పీడింపరైరి?

గాలవ శామ్యాయనా! విశ్వామిత్రుడు పూర్వము క్షత్రియుడు తపముచే బ్రాహ్మణత్వము నందెను అప్పటినుండియు వారతడు చేయు తపమును వారు సహింపజాలరైరి

శామ్య ఐనను, రాక్షసులు తపోవిఘ్నము కలిగింప కారణమేమో?

గాల రాక్షసరాజైన రావణుడు విశ్వామిత్రుని తపోభంగమునకు వారిని నియమించియుండెను

శామ్య రావణునకు విశ్వామిత్రునిపై గోపమేల?

గాల విశ్వామిత్రుడు బ్రహ్మతేజమున ప్రకాశించుచున్నాడని

శామ్య ఐన?



గాల ఏనాటికిని విశ్వామిత్రునకు కోపము రప్పించినచో శమప్రధానమగు నాతని బ్రహ్మర్షిత్వము పొల్లుపోగలదని

శామ్య ఆయన శాపముచే నీ రాక్షసుల నివారింప లేడేమి?

గాల కోపించిన గాని శాపము రాదుకదా!

శామ్య ఎందరో ఋషులు శపించినవారు గలరు వారి బ్రహ్మర్షిత్వమునకు లోపము రాలేదే?

గాల పరంపరాప్రాప్త బ్రహ్మర్షిత్వమున కపుడపు డిచ్చిన శాపముల వలన లోపము కలుగదు ఇతని దచిరప్రాప్త బ్రహ్మర్షిత్వము కావున లోపము కలుగవచ్చును అందుచే విశ్వామిత్రుడు రాముని గొని వచ్చినాడు

శామ్య ఏమో! ఇంతటివాడే క్షత్రియ కుమారుని సాయమపేక్షించినాడన నాతని తపోమహత్త్వమునకు లోపము కాదా?

శాలం కాదు కాదు వినుమ!

"యజ్ఞసంరక్షణంబున కతడు మునుప
రామచంద్రుని గొనితెచ్చి ప్రేమతోడ
దివ్యమగునస్త్రముల మంత్రదీక్షితు గ
నతని నుపదేశమిచ్చి కామ్యంబు గాంచె"

ఇక, రాముడో

"హరిగమవాన, బాలరవి
యందపు మోమున, వాణియాను—
స్ఫురణిని, వార్ధికడు ప్ర
శస్తగభీరత మన్మథుం జను సుం
దరత, నలంఘ్యత న్దుహిన
ధాత్రిధరంబు, మహాపరాక్రమ
స్ఫురణ నతండు దేవపతి
పూర్వపరాక్రమ గర్వశేతయా."

"ఇతనువచ్చినదాదిగా నీతపోధ
నమునొనగ్నెను సుతపోధనము గాగ,
కాంచగంటిమి కన్నులుగలఫలంబు
నితని బ్రాగ్భాగ్యనిధిగాంచి యుంపుమీగ"

గాల రాము ఉజ్జ్వలపారాక్రమ బలశాలి విలన, రాక్షసులు మాయారూపధరులై రాగా నాత డొంటరిగా నిలిచి యజ్ఞమును రక్షించినాడు రాక్షసు లాతని జూచగనే పారిపోవుటచే వారికు వారి కెందఱితో జంపవలసిన పనియే లేకపోయెను మఱియు మారీచ సుబాహులు రావణాసురుని యను చరులలో మహాబలవంతులు వారు నిత్యము విశ్వా మిత్రుని తృణసమానునిగా జూచెడివారు ఒక్క యస్త్రమున వారినిద్దఱి వారకు కొట్టగా నది వారిని త్రిప్పి త్రిప్పి సముద్రమున పడవేసెనట

శామ్య ఈతను తాటకి యను రక్కసిని జంపుట నిజమా ?

గాల నిజమే

"సదయుండై మునిసన్నిధానమున ర
క్షస్త్రీని తో నేయగా
నదినేదంబను గ్రక్కుకొంచు బరమా
యాసంబునన్ రాగ ద
న్నదమున్ద్రుంపగ రాము, డామె శిర భి
న్నంబైన దేహంబుతో
విదితా క్రందితయై రాక్షసులకున్
వెన్వెంట వాటిల్లగన్

ఇట్లు
"మృదులమును గతినంబుగా మదిచెలంగు
మత్తమును రామచంద్రుడో మాహచేయు,
చిత్రచరితులు తలప విశిష్టులైన
మానవోత్తము లతిగూఢమతులు వ్రతులు"

కాలం కేవలము దయచేతను శౌర్యముచేతనే కాదు రామ లక్ష్మణులు పూజనీయులగుట ఋషిగణ విశిష్టమైన వారి ప్రీతిత్వము ప్రశంసనీయము

శామ్య రాజపుత్త్రుల నందఱును స్తుతించు వారే వారి శిష్యులను చక్కని కమ్మని భోజనము, దాసులసేవ, తలిదండ్రుల లాలనము, వైద్యుల యుప చారములు, ప్రేమతో గొట్టక తిట్టక విద్య చేర్పు గురు వులు, ఇంక వారికి జడుపు వచ్చుటలో వింత యేమి ? నేను రోగము వచ్చినను మానక గురుసేవ నిత్యము చేయుదును. భిక్షకై పోవుచు నేయుందును దానం తట నది కొంత లభించిన వంతలోనే జీవయాత్ర గడ పుదును గురువులు నన్ను గతినముగా శిక్షింతురు కేలమీదనే పడక చదువుటకే యవకాశము లేని నిత్య కృత్యములు ఇట్టి నా దల్పవిద్య, అట్టివాని దధిక విద్య నా విద్య కొఱకున స్తుతింపరు రాజపుత్త్రుల నందఱు స్తుతించువారే

గాల ఓరీ! మూర్ఖా! గురువుల నాక్షేపింప రాదు

శామ్య నిజమైనమాట చెప్పితినే కాని యాక్షేపింప లేదు

కాలం పరనిందాకరమైన వాక్యము సత్య మైనను బలుకరాదు వినరాదు గురువు లవాలోచిత గా నే పనియు చేయరు

శామ్య గురువులు స్వలాభ మపేక్షింతురే కాని గుణ మపేక్షింపరు

కాలం ఓరీ! మూర్ఖా! నీ మాటలు నాస్తిక ములు నే నిక వినజాలను.

శామ్య సత్యవచనములు నాస్తికవచనములని నిరాకరింతువా ?

కాలం అజ్ఞానచేతస్కులు హేతువు మాని నను నూరకుండిరు (చూచి) ఆహా! రామలక్ష్మణులు తిన్నమసరింప విశ్వామిత్రు లిటకే విచ్చేయు చున్నారు

గాల (చూచి) ఔను విశ్వామిత్ర భగవా నుడే

"రాజపుత్త్రులతో గూడి పూజనీయ
బ్రహ్మమయులు విశ్వామిత్రపరమఋషులు
వచ్చుచున్నారు వేదతపఃప్రభావ
సమితి నాక్రితధవించిన సరణితోప"

(నిష్క్రమింతురు)

ఇది శుద్ధ విష్కంభము

## పంచమాంకము

[అంత రామలక్ష్మణులతో విశ్వామిత్రుడు ప్రవేశించును]

విశ్వా వత్సలారా! రామలక్ష్మణులారా! విద్యాస్త్రములు మీరు నాకడ గ్రహించి యజ్ఞమును

రక్షించినారు రాక్షసులు పారిపోయినారు నామన
మున కెంతయో యానందమైనది

"ఎంత సుక్షేత్రమున నైన విత్తు ధాన్య
మొక్క చెలలోన సుఫలంబు లొసగ లేదు
ఇప్పు డొసంగిన యస్త్రమ్ము లిప్పుడె నాకు
నుత్తమఫలంబు నొసగె ప్రభోదయమున"

రాము మేము మీయాజ్ఞ శిరసావహించితిమి
అంతకన్న జేసినది లేదు ఉత్సాహమును బురికొల్ప
టకు గురువులు శిష్యు లెంత సామాన్యులైనను స్తుతిం
తురు

విశ్వా ఓయీ! రామా!
"ప్రజల రాక్షస ఘాతశౌర్య ప్రసిద్ధి
వీరుడవు, రావణ శ్రీ వికార హేతు
ఘాతుకుడవు, నేను జాలక పోయినట్టి
పని యొనర్చితి వాసుర భంజనమున"

రాము దేవా! నీ తపోబలమున చే మేము
రాక్షసుల నణపగన్నది సర్వబలములలో నుత్తమ బల
లకు తమకన్న నొరులెంత? మేము శిష్యులము పరి
మితాస్త్రులము

"అరుణకాంతులు చీకట్ల నణచు నపుడు
జనులు తలపోయుదురు గాని సత్యమరయ
సూర్యభగవాను నాత్మతేజోబలంబు
కాంతులవి గాన, మేమట్లు కామె తమకు?"

విశ్వా వత్సా! అది కాదు
"సుమధురామ్ల తిక్తాది రసముల నంది
యోషధుల సూర్యుడు ప్రతి, రుచికరనవియు
నిత్యమాధుర్యమును గాంచి రుచుగ భూమి,
కటువులకు పాదపంబుల గనదు కాదె?"

అట్లే మీకు నే నస్త్రముల నిచ్చితిని వినియో
గించి యవి మీ బాహుబలమున రాక్షసవినాశ
సమర్థములైనవి

రాము నిజమునకు నేను యస్త్రములను ఒక్కసారిగా
నుపాసించినవాడు లక్ష్మణుడు ఈ కీర్తి యంతయు
నాతనిదే కాని నాది కాదు

లక్ష్మ భగవానుడా! మా యశోహేతు
భూతులు మీరు కాకవరు! నేను యుద్ధమున నల్ప
డను. సర్వ రాక్షస నాశనము చేసిన యార్యుని
న్నభినందించుచున్నాడను. అదియే యుచితము లెండు
ఏమైనను ఉభయులము శిష్యులము అల్పశక్తులము
మీరు ప్రేమతో ననుగ్రహించిన కార్యమునకే యీ
మాత్రము చేయగంటిమి

రాము రావణ ప్రతినిధిప్రాపత, సుబాహు మర
ణము, మారీచ దూర నిక్షిప్తత దాని ఫలములే

విశ్వా వత్సలారా! వివిధాస్త్ర శస్త్ర ప్రభృ
తులు మాయారూపులు మహాబలులు నగు రాక్షసులు
నైకస్వతంత్రపాలితమగు నంత భూమి యుండగా
మా తపోవనముననే సేనా నివేశము చేసికొనిరి మారీచ
సుబాహులు నాకు భయకారకులని రావణుని
తలంపు.

రాము అతడు మహాబలుడని వింటిమి

విశ్వా ఔను నాతడు మీకన్న దశగుణ బల
శాలియే యిలన

"వీరుదైవంబులకు దాంతి వలయవలయు
నిలయువాడె ధనాఢ్యుకీ వీరవరుడు,
దాంతి లేని వీరత్వంబు కాంతిలేని
దీపమట్టులు వ్యర్థమై దీను జేయు"

రాము వీరతకును దాంతికిని బరస్పర విరో
ధము కాదా?

విశ్వా
"జలసం పూర్ణ గర్వితంబై యతివ
ర్షాకాలగా కన్యకగా
తలపంగా మృగరాజు కొనన
దంతావళాధీశ్వరుండ
నలప్పి ప్రవ్వడ సింహనాదములను
త్సాహంబుతో యు, వీ
రు ఎవిన్ శౌర్యము, దాంతి యుట్లు నా
రూఢం గవంగా లెన్"

రాము వారికి నాతడు యుద్ధము వచ్చినపు
డెవరు గెలుతురు?

విశ్వా
"ధర్మప్రవృత్తి మది తప్పంబు గాగ
వారికిని మీకు యుద్ధంబు వచ్చు నిజము,
అందు సందేహ మేల విఖ్యాతభంగి
మీకె యగు నుత్తమజయం బమేయ యశము"

రాము ధర్మప్రవృత్తి యెట్లు కలుగును?

విశ్వా రావణు డసర్వ రాక్షసాధిపుడు నీ

వన్నతి తెలువారు సూర్యుడు ఘ
నప్రతిరోధము బాపినంతి స్వ
చ్ఛత వికసత్సరోజముల సంగతి
నొప్పు సరోవరంబు నీ
గతిని నిరోధ మీగిన ప్రబ
కాంలు గాగ సమస్తవస్తువుల్ "

రాము ఇంసలి స్వచ్ఛసరోవరజలముల దోచు సూర్యబింబమువలె మానిమానసమురీతి హింసాహీనములై పక్షులు శాంతిసుఖమందును

లక్ష్మి
"సరసులోని యగాధంపు జలములోన
తెనగు నుత్తమమానసౌకసము లొప్ప
సకలరసపూర్ణ కవిచిత్తసద్మమంగు
బరగుమజ్జ్వల సూక్ష్మభావముల భంగి"

రాము
"కేకరమణులు స్వాగతగీతి బాడి
మేఘరాజికి సంతోషమేదురలను
నృత్యములు సల్పె మన్న, ఫ్లు నీరదాళి
ద్రోలి రవి వెల్గ రేకిపప్పౌరి రాలె"

విశ్వ వత్సలారా! ఈ శరత్కాలశోభ యింకను జూడుడు

"ప్రబలశత్రుఘనాంధకారమున యునికి
తొలరి చంచలదీప్తితో వెలిగి మున్ను
నిర్మలంబుగ నొప్పు నీవింగి యిపుడు
కాళిత్రిణపీఠనంబున గంకుమిగలి"

మఱియు
"మేఘపటలి ద్రుంచి ఏన్ను చెల్వొందగా
బరవ్నపతుల గెల్చి వజల రాజు
ప్రజలు దెలుపురీరు బరమ ప్రథము గా
బద్మవితతి నయనపర్వ మగును"

ఇట్లు మన కీతపోవనమున శరత్స్వరము సాక్షాత్కారమైనది అది నిత్యనూతనమునుచున్నది తపోవనాంతికమున వన్యఘోష వినవచ్చుచున్నది నగరవ్యవహారము లిట కతిదూరములైనవి ఈ యరణ్యమున మృగసమానవృత్తితో గ్రామ్యజను లాత్మధర్మముల నెఱుంగనివారైనను సధర్మసూత్ర మాచరింపరు. పరస్పరవైరములు స్వైరవిహారములు వీ రెఱుంగరు గ్రామీణస్త్రీలు నిత్య మాతిథ్యపరలు అపకారము సైతము వీరతిశీఘ్రముగా మఱతురు మిమ్ము వా రభివందింపగలరు చూతురుగాని

రాము వీరి కంటబడక మనము తప్పించుకొన లేముకదా!

లక్ష్మి ఈవనశోభ మఱగి యీ దేహము చిత్తము కూడ దూరబాధ నందనున్నవి ఇపుడు నిస్సగ్నము, అర్ధహామకృతము నవ తపస్వీచరితము భగవాను లన్నట్లు ప్రత్యక్షముగా జూడగందును

(అందఱు నడిచెదరు)

లక్ష్మి (చూచి) ఆర్యా! చూడుము
"సస్యభారనతంబయి స్వర్ణకాంతి
నొప్పుకలమపుటెన్నులు గడలుకొన్న
క్షేత్రభూమిని గన్గొన్నమాత్రమునను
బొందుచుంటి నపరిమితానంద మిపుడు"

విశ్వ ఆ మూల నూర్చుండియున్న కృషీవలుల గంటిరా? క్షేత్రములు చక్కగా దున్ని చదునుచేసి యాతమట్లు పెంచి దమ్ముచేసి వర్షము కురియగా నూడ్చి పిదప గలుపు తీసి రేయింబవళ్లు కనిపెట్టుకొని యుండి శ్రమఫలము లగు సస్యముల గోసికొని క్షేత్రోపజీవు లింద్రభోగ మనుభవింతురు వారి కెవ్వరీడు రారు కష్టఫలము ననుభవింతురు, నిర్వ్యాకులు విజముగా వారే ఈరీతి బండిన సస్యములో

"దైవతపైతృకక్రియలు
ధార్మికబంధుజనాళి తృప్తి సౌ
ఖ్యావహమౌట భాగముల
నంచితరీతిని వాని బంచియున్
గోవుల పెంపువారలకు గొంత
త్యజించి యుచితంబుగా
బావనభంగి నాత్మజుల
భార్యల గూడి భుజింత్రు శేషమున్"

లక్ష్మి ఈ కృషీవలుల చరిత్ర మతిశ్లాఘ్యము

విశ్వ మఱియు, వారు
"శ్రమ గణింపరు దైవవిశ్వాసమునను
దొరకినది తృప్తిగా దిని దోషభావ
రహితులై పిక్కటిలి సుఖింత్రు రమ్యభంగి
సర్వజీవితహేతువుల్ సజ్జనులయి."

అంతేకాదు, వారికి

అజగన్మోహనాంగి వక్షోజ కుసుమ
పేశల సుగాత్రి నొనరించి విధి తలంప
గాంచి స్త్రీరూపనిర్మాణ కౌశలమున
కచ్చెరువు చెంది గర్వించి యుండె బోలు

అహో! చిత్రము!

"ఒక్కసారి కనుంగొనియున్నమాత్ర
మఱచిపోయితి సర్వమ్ము మతి కలంగ
నింక నొకమాఱు కనుగొన్న నేమియగు
నో? యెఱుంగను నిజము మనోహరాంగి

మఱియు

పరమానందముతోడ వత్సలతతో
బాల్యంబునన్ దల్లి మ
త్పరయై స్తన్యమొసంగు నాది రొఱుగన్
ప్రాసాదమున్ వీడి, నా
కరయన్ గానవశాల్య మెన్నడును లే,
దారాక్షసశ్రేణి పెం
పడిజేయన్ జలియింప, నా కిపుడు సం
ప్రాప్తించె నున్మత్తతల్"

యజ్ఞవిఘ్నకారు లగు రాక్షసులను శస్త్రాస్త్రముల నాశము చేసితిని కాని నా యాత్మశక్తిపై నాకం తమ విశ్వాసము కోలుపోయి యెఱుంగను ఆమెను గనుగొన్నది మొదలిగి యంతయు వ్యాపంచవలై పోయినది అహో! కాము డతిబలవంతుడు కదా! ఈ కామ జ్వరము నా దేహమునంతయు దహింప జేయుచున్నది నాచే నేయకార్యము చేయించునో? ఏలన, ఇది ఋషి యాజ్ఞవలన జేయుకర్మ కాదు ఇది యకార్యము గురువులకు నివేదింపక చేయునేపనియైనను గొంగపనియే కదా! మఱియు సరణ్యమున యుద్ధమున నెల్లపుడు లక్ష్మణ ద్వితీయుండనయియే కాని యొంటరిగా నుండియుండుట లేదుగదా! నా వెనుక లక్ష్మణుడు లేడు గురువులు లేరు ఇది న్యాయమా యన్యాయమా యని విచారణ లేదు అది గ్ఘోరతము వలె మానసమును గాఢముగా కలచివేయు చున్నది ఇక రాముడు విషయములకు జలింపడని యాడిన్న మాట పొల్లువోయినది కదా! కానిమ్ము, విశ్వామిత్రులకు దూరమున నుండుట మంచిది కాదు సమీపమున కేగెదను అవిజ్ఞాత కులాచార స్త్రీ దర్శన ప్రసంగమునుండి మనస్సును మరలించెదను కాని

"ఈమె జూపెడ యానంద హీనముగను
నా మనస్సది, ఇకపైని నేమియయిన
బరమపావనమైన నా చరిత మెట్లు
విమల తక్కుంపె నగుదు నే? వేయు నేల!"

(పరిక్రమించుచు) అహో! అడుగు పడుటలేదు

"ఒక్కయడుగైన నిషజాలకున్న వాడ
గరము దృఢతరమాయె యీ చరణ యుగళి?
ఆమె జూపెడ యీ కన్నులౌర? గొంకు
చూపజాలక యున్నవి చోద్యమౌర!
"ఆమె జూపంగ దలచ్రాని వంతమాత్ర
నవిరళానందమందు నాయంతరంగ
మామె తనువల్లి ముఖబింబ మరయగందు
మరల నానంద వార్నిధి మగ్నడౌదు"

(ఆలోచించి) ఇది కాదు కొంతసేపాగుదును. సందిగ్ధ ఫల విషయమున మతిమంతుడు శ్రమపడడు ఇట నుండు టుచితము కాదు ఏలన, మహర్షులు బ్రహ్మచర్య నియమఘనులు వారికే కాదు మనస్సును నిరోధించుటయే సర్వజీవులకు ప్రథమ కర్తవ్యము మఱియు

"బ్రహ్మచర్య వ్రతంబున బరశురాము
డరయజాలదు స్త్రీముఖ మన్నమాట
పొల్లువోరాదు మఱియు నిప్పుడు తలంప
నొంటి నుంటిని స్త్రీ గను టురవు కాదు"

(జయించుట నభినయించి) ఇటులేగెదను (ముందు చూచి) ఓహో! నా నేత్ర పద్మముల నానంద సరసిలో మునకలాడించిన యా సుందరి యీ తరుమూలమున గూర్చుండి యున్నది ఇట నేయుండి యామె దర్శన సుఖమనుభవించెదను

(పరిశీలించి) ఇది గాలిచే గదలు మాధవీ లత చీ ఇది నన్నింత పరిహసించుచున్న దేల? లేక ఇది కామునో వికలతయా? ఔను కాముకులు వికలచిత్తులే

"ఆత్మవైభవమంతయు నవలద్రోచి
దేహ మతికామ తప్తమై తెలుగగంటి
ధైర్యవంతులు శ్రద్ధచేతస్కులౌట
నా మెరూపంబుగెదనుండి యవలద్రోతు"

(ఆలోచించి) అట్లను టుచితము కాదు

"వ్యధితమనమున మోహమవాంఛియున్న
నన్ను గనుగొన్నదా యన్నమిన్న తవద్ధు

మోహముదమ్ముల నలవాంచి పూర్ణముగను,
తలపసహ్యమహీనమైన చేపలంకమైరి ”

మఱియు :

“ బోమముడిపనప్పుగా జాపుములికిగాగ
నాయొడంద లక్ష్యమ్ముగా నాతియే సె
బ్రణయ నూదకముగ నేను బరముమూర్ఖ
మతిని బాంధుండ నయ్యె నా యతివ గొనమ ”

ఏమక జరిగినట్లే ముందును జరుగగలదు నేను వృథా విచారక్రమము నందనేల? పోదును

(తెరలో) “ సఖీ! ఇటు, ఇటు ”

రాము (విని, చూచి) కాదు నా మతి భ్రమ కాదు సత్యము మమానంద నయనానందస్యందిని శారద పూర్ణేందుముఖి మూర్ఛితుడ నగునన్ను వదన శోభా సంజీవని చే జేయుకొనకేయ సఖులతో యిటే వచ్చుచున్నది

“ నభమునపై మేఘమును జూచి నాట్యమాడు
నెమిలికివలె నీవచ్చు విరుపమాన
సుందరీరత్న వదనారవిందమును గని
మనస్సనము నాట్యమొనరించు మహితభంగి

(అంత సఖులతో సీత ప్రవేశించును)

ఒకసఖి భర్తృదారికా! ఈ యుద్యానమున నెటగూర్చుండి మనోవినోదమును గావించుకొందము?

మఱియొకసఖి ఆ మాధవీలత దగ్గఱ అశోక వృక్షము నీడ

సీత సఖీ! చంద్రకళా! భర్తృదారికా యని క్రొత్తగా బిలిచెదవేమి? ఇదివఱకెట్లు సఖీ యను దానవో యట్లే సఖీ యనుము

చంద్ర నిన్నటినుండి నీవట్లుగ పదుటచేతనే యట్లంటిని

సీత : మధురికా! నీవట్లందువేమి? మీరిరువురకు కదా సీతకు ప్రియసఖులు.

మధు నీవు మఱియొకరి దానవుకాలె గనబడుచున్నావు చపలవు ధీరవునాదువేమి? కనులు మైకత్తు. నీవు రాగముచే నిద్రలేని దానవుకాలె నున్నావు ఏకాంతమున నీ మనసులో నేమో యను కొనుచున్నావు.

చంద్ర : ఇప్పటికి వేగముగా వచ్చితిని కూడ.

మధు : నీలో యౌవన వికారము కనిపించు చున్నది ఏ యువకుడు నీ బాహులతచే గంఠము నలంకరించుకొని ధన్యుడు కాగలడు?

సీత ఏమో తెలియదు

రాము ఈమె యెవరి భాగ్యరాశియో తెలియదు ఎవరో బ్రహ్మర్షి కుమారకుడో నాకు లభింప జాలదు అన్యకథునైన నలభ్యయే. అందుచే నీమె ముఖారవిందమును హృదయములో దాచుకొని యుంచుట వ్యర్థమేయగునేమో (ఆలోచించి) అట్లు కాదు ఏలన

“ పరవనిత యైన నీమె దుష్ప్రాపమైన
నామనస్సెట్లు పరుగెత్తు నీమెపైకి?
మనసె కాద! కృత్యాకృత్యమతి వివేక
మునకు నుత్తమ ప్రామాణ్యమున ధరిత్రి ”

సీత ఏలొకో కాని నామనస్సీ యుద్యానమున పమకటివలె ప్రసన్నముగుట లేదు శరీరమునకు జాల సంతాపము కలుగుచున్నది కదలమైన గదలజాల కున్నాను

మధు ఆ మణి శిలాతలమున గూర్చున్నచో భర్తృదారికకు ఒసుకు పరిమళముతో నుద్యాన వాయువు వీచి స్వస్థత చేకూర్పగలదు

సీత ఔను కూర్చుందము [(కూర్చుండును) దీర్ఘముగా నిశ్వసించి] సఖీ! నా శరీర సంతాప మధికమగుచున్నది

మధు (వళిసీదళమున సీతకు విసరును)

రాము ఆమె శరీర సంతాపమున నేను దహించుచున్నాను.

“ తరుణ మాధ్యద్యానసరో
వారితరంగ ప్రభూత వాయువు సుమన
తోప్రరథము మందములయిన
మారుడు నన్నేచ దోడగ మిక్కిలి నకటా! ”

కారణ మేమైయుండును? సరే తెలిసినది.

“ మానసజేహింబులలో
మానస మది ధర్మమార్గమహిమ దలిర్పన్
మానసము వీడి దేహము
మానంబుగ దప్తమగుచు మండగ బోలున్. ”

సీత : నాకీ చల్లని గాలికలను శాంతించుట లేదు. మీరు శ్రమపడవద్దు.

మధు (జనాంతికముగా) చంద్రకళా! నేననుకొన్న సంతాప కారణము నిజము. ఇది శరీర సంతాపము కాదు. మనస్సంతాపమే

చంద్ర రాముని మూలముననే యిది యని యామె సత్యము చెప్పదాయె

మధు: (జనాంతికముగ) అద్భుతుడు రాముడు విశ్వామిత్ర పరతంత్రుడై దృఢవ్రతము నవలంబించి యున్నాడు అతనిని లొంగదీయ సాధ్యమా?

రామ ఈ సంతాపము వలన నామె ముఖము తెల్లబడుచున్నను మఱియొక నూతనశోభనే యందు చున్నది ఆశ్చర్యము!

"కాంచగంటిని గన్నుల కఱవు తీర
నమృతనిష్యంది యౌ నీమె యాననశశి,
ఐన దాపంబు మిక్కలి యధికమయ్యె
విధికృతంబులు బహుచిత్ర విసములౌర!"

చంద్ర (జనాంతికముగా) మఱి యుపాయ మేమి? ప్రియసఖి భర్తృదారిక శోచనీయావస్థలో బడిపోయినది

మధు (జనాంతికముగా) సరే ధర్మవిరోధము కాని ప్రణయము పరిగణింపదగినదే యని విశ్వామిత్రుల మతము అందుచే నీమె విషయమున నాయన ప్రసన్నులే యగుదురు

చంద్ర (జనాంతికముగా) ఏదో యుపాయము చూతము

సీత: సఖులారా! ఎండ చాల బాధించుచున్నది

మధు. ప్రియసఖి! సీతా! చెట్టునీడనున్నావు ఎండయేమిటమ్మా!

సీత (లజ్జతో) ఇది నీడయా?

రామ

"చెట్టునీడను గూర్చుంటి చిరమునుండి
పడయుచుంటిని జలిగాలి స్పర్శమైన
నత్యధికమైన సంతాప మందుచుంటి
నేమి కానొకొ గారణం బింతకుడు!"

"కామజంబైన తాపంబు కాంతకంటె
బురుషునకు మిన్న యౌనుగాబోలు — కాదు
స్త్రీల విషయము నాకేమి తెలియు! ఏల!
యింత గొడవ! నేనాడుగా మాంతకుడను."

నేత్రానందదాయకుడగు నీయుత్తమునిఁ గాంచి యామె విరహ మనుభవించుచున్నది వాడెంత ధన్యుడో అన్యానురక్తను గామింపకుండుట ధర్మ నియమము కాన నీవిషయమునుండి మనస్సును మరలింతును

"ఉత్తమవివేకఫలము నన్నొందవలయు
నంతియే కాని యవివేక మందరాదు
విరతయి సుఖమిచ్చు నీవిషయవనయి
ప్రాజ్ఞతను గోలుపోవుట పాడికాదు"

మధు: (జనాంతికముగా) నేను స్పష్టముగా ప్రియసఖిని జూచినాను

చంద్ర (జనాంతికముగా) ఔను

మధు ప్రియసఖి! నీయీ సంతాపము మదన సంతాపమువలెనే యున్నది ఎప్పుడా రామ నీ యుద్యానవనమున నీవు చూచితివో యప్పటినుండి నీ సంతాపమారంభమైనది ప్రతి దినము వృద్ధి పొందు చున్నది ఇది నిజమైన చెప్పు ఏదో యుపాయము చూతము

రామ (విని హర్షముతో) ఏమి? నేనే యామె తాప కారణమైతినా?

"స్మరణమున గాఢసంతాపభరము కలుగ
జంచలాక్షులు హృదిలోన నుంచుకొంద్రు,
నన్ను సంతప్త నొనరించి ఖిన్న జేయు
నామె పూర్ణేందువదనరమ్యత్వ మహహా!"

ఆహా!

"స్వార్థబుద్ధిని నన్యదుఃఖాదికంబు
నెవ డుపేక్షించువాడు మానవుడు కాడు,
దుస్సహంబైన తాపంబుతో గలంగు
నామె కొదవింతు నానంద మవిరళంబు"

సీత. నా మనో వికారమునకు గారణమేమో యీ యిరువురకు దెలియదా?

మధు తెలియదు.

సీత (సిగ్గుపడును)

రామ. ఛీఛీ. కష్టము. నా గంధర్వ నగరము విధ్వస్తమైనది అలసులు దీనులు మూర్ఖులు కామ్య కర్మము లొనరింతురు. ఉత్తములు ఫలచిత్తులు కాక ధర్మార్థమే కర్మమొనర్తురు. కావున నేను ఫలమో యఫలమో యామె కలత బోగొట్టుదును.

మధు : ఏ కారణమునకో తెలియని నీ వంతాపమునకు నివారణోపాయమెట్లు మాకుమర్మమా నీవు చెప్పనిచో?

సీత : చెలులారా! మీరు చెప్పిన కారణము నిజమే మీరు చెప్పినదే మీచే నెట్లు చెప్పింపగలను?

రాము (సంతోషముతో) సంతోషమునైన విహితమగు కర్మకర్తము లేకపోదుకదా! ఈమె యెవరి కూతురో!

మధు సరే! వెంటనే యీ వార్త మహారాజునకు విశ్వామిత్రునకు ఆర్యుడగు రామునకు తెలుపుదము

సీత (దీర్ఘముగా నిట్టూర్చి) ఒక పెద్ద సంగతి మీరియపుడు మఱచిరి

మధు : ఏమది?

చంద్ర నాకు తెలియును శివుని విల్లెక్కిడిన వానికే తన కూతునిచ్చెదనని మహారాజు నిశ్చయించినాడు అది దుష్కరమగుటచే రామున కది సాధ్యమా యని ప్రియసఖి జడియుచున్నది

సీత (దీర్ఘముగా నిశ్వసించి) ఔను

మధు రాముడెంత సుందరుడో యంత బలవంతుడగుట శివధనుర్భంగము గావింపగల సమర్థుడే

సీత కానివాడు నేను జీవింపలేను (మూర్ఛిల్లును)

చంద్ర : దేవతలారా! రక్షింపుడు సీత మూర్ఛిల్లినది.

రాము : (దవ్వుచు చేరి) భయపడకుడు నేను ప్రియురాలి (అర్ధోక్తితో మానము వహించును)

మధు : ఆర్యునకు స్వాగతము. ప్రియసఖి నిట్లు శోచనీయ నొనర్చుట భావ్యము కాదు

రాము అంతయు వింటిని ఈ పుణ్యాత్మురాలి తండ్రి యెవరు?

చంద్ర . బ్రహ్మజ్ఞాననిధి-జనక మహారాజు

రాము . (తనలో) ఏ కుల కన్యయో యను కొంటిని ఆ కులము పవిత్రుడగు జనకమహర్షిది జాతమైయీమె పరితపించుచున్నది శోభాస్పదగా నా సుఖము కొఱకే విధి యీమెను సృష్టించి యున్నాడు (ప్రకాశముగా) ఈమె సఖల మనోరథము కాగలదు కాని, నేనే యదృష్టహీనుడనని (అర్ధోక్తితో విషాదము నటించుచు తనలో) "విశేష వినయాపేతుడనని జగము తలంచునేమో?

చంద్ర (తనలో) తెలియవలసినది తెలిసినది

మధు మహారాజు మిగుల దుష్కరమగు పణమే యుంచినాడు

రాము అదియు నేను వినియే యున్నాను

"శివుని వింటిని సజ్యంబు చేయగలుగు
మానవుని శక్తి దుష్కరమానటంచు
రాజు దీని బణంబు నా యోజచేసె
నను చు దలతును విఫల సుఖాశతోడ"

మధు నీకు ప్రియమే యగును

"పరమ వీరుడ వీవు దుష్కరమునైన
పని గలద నీకు నని నేను నమ్మెదను
నీవు మాపె మహాశౌర్య నిధివి గాన
నీకశక్యంబు గలద యీ లోకములను?"

చంద్ర ఆర్యపుత్రా! నీకు

"దేహమందున శౌర్యంబు దీప్తమాను
అధిక దుష్కర కృతియైన నగును సాధ్య,
మల్పకాయంబు గలదియే యైన సింహ
మధిక కాయము గలయేన్గు నణచుగాద!"

(తెరలో) మహారాజా! ఇటు ఇటు

రాము అహా! భగవానుడు

"రాజత్వంబున సుస్థితుండు నయ
దుర్గాహంబునా బ్రహ్మస
త్తేజం బంది వెలుంగు రాజఋషి,
యుత్తీర్ణుండు జ్ఞానాంబుధిన్
ప్రాజిష్ఠుండు నిరస్తసంశయుక
విజ్ఞానంబుచే సంసృతిన్;
రాజై యున్నను శాంతమూర్తి
పరమప్రాజ్ఞుం డితే వచ్చెడిన్"

నేనిచట నుండదగదు పోయెదను. (నిష్క్రమించును)

సీత : సఖులారా! ఇపుడేమి చేయుదము?

చంద్ర ఇపుడు క్రొత్తగా చేయవలసినదేమి! మహారాజు వచ్చుచున్నాడు కావున ఎదురేగుదము.

సీత. నా సంతాప వృత్తాంత మాయన వినలేదు కదా?

మధు నీవిట్లు శంకింపకు. ఆయన విన్నచో నీ సంతాప ప్రతీకారము చేయును

సీత. నాకష్ట సమయమున నన్ను బరిహసించు చున్నావు.

మధు : నీ దుఃఖ శాంతి యగును లే

సీత మరల వేళాకోళమా?

మధు. వేళాకోళముకాదు విను రాముడు కానరానిచో నీవెంత సంతాపపడుచున్నావో నీవు కానరానిచో నాతడు నంత సంతాపమే యందు చున్నాడు

సీత : పోవే ఆయన పేరెందుకు జెప్పెదవు?

మధు ఆయన మనమిత్రుడు కనుక.

సీత (కోపముతో) నీకట్లు తెలియును?

మధు (చెవిలో) ఇట్లు

సీత నిజమా?

మధు నిజమే

సీత. (లీలగా) ఏమే. అసందర్భ ప్రలాపము లాడెదవు? ఆ మాట నమ్మవచ్చునా?

(తెరలో) మహారాజా! ఇటు ఇటు
చంద్ర మహారాజా వచ్చినారు
(జనకుడు చేటులతో ప్రవేశించును.)

జనకుడు :

"అనుపమ సద్గుణాళి వలరారెడు
కన్యక గాంచి పెంచి యా
మెను విబుధుండు నిర్మలుడు
మేదుర సద్గుణ శాలియైన యొ
క్కని కొసగంగ గాంచిన సుఖంబను
గాని యయోగ్యవర్తి కొ
క్కని కొసగంగ గాంచునెడ
గష్టపరంపర చెప్పశక్యమే!"

సీత (చేరి) నమస్కారము (నమస్కరించును.)

జన. వత్సా! సర్వగుణనిధియగు భర్తను బడయుదువు గాక!

సఖులు. ప్రియసఖీ! తండ్రిగారిని వరయాచనను ఆశీర్వచనము నిమ్మని కోరవే.

సీత. (కన్నీటితో) తండ్రి పెండ్లిచేసి నన్ను దేశాంతరము పంపి వేయును.

జన దేశాంతరమో జన్మాంతరమో ఏమైనను జీవికి స్వకృత్యములు తప్పవు కన్నవారెల్ల మిన్నలగు బంధువులని తలచి యాతడు మానపోవును ఇట్లు మానపోని జీవియేయున్నాడు

ఏది యెట్లు జరుగవలసియున్నదో యట్లే జరుగును నీవేగవలసిన చోటికి యేగదవు విప్రయోగ భావముచే నీవనవసరముగా హృదయమును బాధ పెట్టుకొనకుము.

"కలిగియున్న దుఃఖంబును దొలచుకొన్న
నాను మిక్కిలి యానందమట్లు కాక
సుఖమె యుంగక దుఃఖంబు చొప్పగన్న
నొక్క కార్యంబు కూడను జక్కబడదు"

సీత. (కన్నీటితో) తండ్రి మిన్న ధైర్యము తనయకెట్లు వచ్చును?

జన అవసరమునుబట్టి నీకును ధైర్యమదియే వచ్చును మగని ప్రేమ మఱిగితివా మమ్ము వెంటనే మఱచిపోదువు

సీత తండ్రీ! అట్లనకుము

"ఎంతవఱకును సంసృతి యొసగు నాకు
నంతవఱకును నామనమందు దండ్రి
పరమపావన భవదీయ పాదపద్మ
యుగళి మెన్నండు మఱవంగనోప నేను"

జన వత్సా! మంచిదే అది సముదాచారమే నీవు భర్తతో వెడలిన వెనుక గలుగబోవు మా ఎడబాటును గూర్చి యాలోచింపకు.

"ముందు కాలంబునందు రాబోవు దుఃఖ
మెన్నడును గూడ దలపోయ నెంచరాదు
గడచిపోయిన కాలాన గన్న దుఃఖ
మెంత త్వరలోన మఱచిన నంత సుఖము"

అందుచే నీవు సఖులతో నేగి కేడముందుభాగమున గల బుద్ధి వర్ధన పీఠమున గూర్చుండి మనస్సును వినోదపఱచుకొనుము. (చేటులతో) మీరు విశ్వామిత్ర భగవానులతో వంథోగ్యపాసనమైన బహుళ సేన వచ్చి వారు నివేదించినదెల్ల బరిపాలించెద నంటినని చెప్పి రండు.

అందఱు ! చిత్రము. (జనకుడు తక్క అందఱు నిష్క్రమింతురు )

జన  ఈ వేళ ఆఱుగడియలకు నాకు సుక్రాంత స్నానము పిదప అర్ఘవిధానమున సీతను రామున కిచ్చెదను వినుడు, కులమన్న

"పరమ విఖ్యాత మా రఘు వరకులంబు
రాముచే బుట్టుడు క్షాత్రవిరాజమాన
సుగుణ పుంజము సీతకు దగినవరుడు
ఆమె వలచిన దితని నింకేమి వలయు?"

ఇక శాంతివచనమురారోపణ రూపమగు పణము నకు రాముడు నిలువగలవాడేయని విశ్వామిత్ర మహర్షి చెప్పియే యుండెను (ఆలోచించి) రాముడే యిది చేయలేనివాడు విశ్వామిత్ర భార్గవరాములను దప్పించిన విక నిందులకు సమర్థుడెవడు? నా పణము యాథ ఫలమునుగాని నిష్ఫలమునుగాని యొన్నడు నీయదు భగవానుడగు భార్గవరాముడు శాశ్వత బ్రహ్మచారి విశ్వామిత్రుడు వనవాసి నా పణము విని యెందఱో వీరులు విభ్రమములో విచ్చేసి యది నిర్వహింపలేక నిందించిపోవొచ్చిరిగదా! విశ్వామిత్రవచనమున విశ్వాసముంచి యీ మహాభాగుని కొఱకెదురు చూచుచుంటిని (పరిక్రమించి మరల నాలోచించి) నా పరమసఖుడగు దశరథ మహారాజును బిలువనంపెదను నా కోరిక పాటించి యాతడు తప్పక విచ్చేయును రాణులతోడను వసిష్ఠభగవానులతోడను కుమార మంత్రి భృత్య పరివారపురస్సరముగా విచ్చేయుమని కోరుచు నిప్పుడే దశరథుని కడకు దూతను బంపుదును మఱియు

"ఏ నృపులు వచ్చిన యీ వింటి నెత్తలేక
కడు నిరాసులై పోవగనిరో వారి
నందఱను బిల్వనంపెద నరుగుదెంచి
వార లీ యుత్సవము జూడవలయు నేడు"

అంతేకాక.

"ఈ పణము దుష్కరంబని యెవరు నన్ను
నింద చేసిరో వారు వారందఱరయ
గలరు రఘురాము శక్తిని, గాంచి మిగుల
సిగ్గుపడగాంత్రు తమ తమ చేవ తెలిసి."

ఇంకను

పరముండౌ హితుడైన యా దశరథున్
భార్యాత్రయిన్ బిడ్డలన్
వరసంజాతుల నా గృహంబున
మహానందంబునన్ గాంచెదన్
చిరకాలంబునకిట్టు; లాతడును
విర్నిద్ర ప్రమోదంబునన్
వరపుత్ర ప్రకట ప్రతాపముగనున్
వహ్వా! యనన్ లోకముల్"

(నిష్క్రమించును )

ఇది షష్ఠాంకము.

## నిర్వహణాంకము

[అంత సూర్యుండు సదస్యులు, సభ్యులు, దశరథ మహారాజు కుమారులు, జనక మహారాజు, పరివారము, వసిష్ఠ భగవానులు, విశ్వామిత్రుడు, శతానందుడు, మంత్రులు, రాణులు, పరిజనులు, రాజులు ప్రవేశింతురు ]

జన (లేచి)

"అతిమము నపచెడి జ్ఞానతేజమును గాంచ
బ్రహ్మమయముగ దోచు సర్వంబు ధర్మ
కర్మ మొనరించి లోక సౌఖ్యమ్ము కొఱకు
వార్త విజ్ఞత నెల్లరు నలరవలయు
కర్మపరము సమస్తంబు కాన గర్మ
విహిత శక్తుండగా నెట్టి విజ్ఞుడైన
ధర్మ యుక్త కర్మంబు నిత్యంబు జేయు
సజ్జనుడు నిర్మలంబైన శాంతిబడయు

ఒక్కడయ్యును సూర్యుండు పెక్కుగిరుల
గాంతి పుంజము వెదజల్ల గాంచునట్లు
ఒక్కటయ్యును నాత్మతా పెక్కుగతుల
వివిధ కృత్యంబు లొనరించి వెలయుచుండు

విధి విధించెను యజ్ఞంబు విజ్ఞులకును
యజ్ఞమున దేవతలు ప్రీతి నందు చుంద్రు
యజ్ఞమున గొల్తు రీశ్వరు నఖిల జనులు
యజ్ఞ మొసగును గామ్యఫలాళి నిజము."

నా యజ్ఞము సమాప్తమైనది ఇక అర్ఘ్యవిధి నను సరించి రఘుకుల దీపకుడగు దశరథ మహారాజా జ్యేష్ఠ పుత్రుడు సకల క్షత్రకుల మలాలంకారుడు, భుజబలోత్సాహిత భగ్నా నేక మహాబల వీరాలిచాలితో గ్రచాపుడు, భుమయాతుధాన వధనివారిత తపోవన భయ సంకటుడు, సుకృతిజన మనః కుముద ప్రసాద

దేహము భూతుడు నగు రామచంద్రునకు భూజాతయగు సీత నిచ్చుచున్నాను. అను రక్తానురూప వరాభిలాషులు తుల్యగుణ ప్రీతిచే అపరిచ్ఛేద్యాభినందితులు నగువారికి కేవల వ్యవహారయాత్రకే వివాహము చేయవలయునని చెప్పబడినది

కావున, రామ తుల్యగుణరూపయగు సీతను రామునకు, భరత లక్ష్మణ శత్రుఘ్నులకు క్రమముగా నాయువ్వతులను మాండవి ఊర్మిళ శ్రుతకీర్తి తగిన వారు వధూవరులు తుల్యగుణవంతులు, తుల్య రాజవంశ సంబంధులు నగుదురు దీనికి మీ యందఱి యనుమోదము నున్నచో నంద ఱొక్కసారి స్వస్తి వాచకములు పల్కుడు

అందఱు స్వస్తి స్వస్తి స్వస్తి. (ఆకాశమున పుష్పవర్షము)

దశ (లేచి) అహా! ఏమి నా యదృష్టము

"జనకక్షితీంద్రుడు దాత గాగ
గురువుల్ సాన్నిధ్యమందుండ నీ
జనపాలేంద్రులు సంతసింప
ఋషిలోక పుంజమైనట్టి యీ
జననాథాగ్రణి బాంధవంబునను
వంశంబెల్ల ధన్యంబుగా
దనరెన్ దుల్య వయోను రూపముగు
పుత్రశ్రేణి కల్యాణముల్."

వశి

దశరథ పుత్రరత్నములు దాంతులు
శాంతులు కన్యరత్నముల్
గెలిద విశేష లస్త్రబహు విద్యలు
నారద చేర్చి యాజ్ఞమున్
వసులయినట్టి వారిటు వివాహ
మహోత్సవ మందుచుండిన
దృశ్యము గాంచగాగ నిట
ధన్యత నైతి ముదబ్ధి దేలితిన్.

విశ్వా:

"తగిన సఖుండనౌ దశరథ
క్షితిపాలుడు శుద్ధవర్తుడీ
సుగుణ విదేహ భూపతి
విశుద్ధ మనస్కృతి గొల్చినట్లు, స
త్యగణిత బుద్ధు లస్త్ర విదులైన
కుమారులు నాకు శిష్యులై య
ట్లగుట వివాహ మియ్యది
ముదంబుధి దేల్చెను నన్ను మిక్కిలిన్"

శతా

"పరమ విశుద్ధ వంశమున
ప్రాభవమందిన రాజరాజుల
కరణిని సత్తమోత్తమము
గా వెలువారగ బాంధవంబునన్
బరగుకులంబు నా కొదవె,
పౌరజనంబులు సౌఖ్యలబ్ధికై
యురువుగ గూడె రత్నమును
హేమము గూడినయట్టు లింపగున్"

(తెరలో) "ఏమీ! ఇంత మహోత్సవము నాకు దెలియకుండగనే రాజులు చేయబూనిరా?"

అని ఓహో! పరశురామభగవానులు భ్రూభంగమున భువనభయంకరముగా నిటు వచ్చుచున్నారు

(అందఱు లేచి వినీతశిరస్కులై నమస్కరింతురు)

రామ (లేచి) భయపడకుడు భయపడకుడు

"శస్త్రయుగంబునో లేక శాపమునో
దంప వచ్చిన యీ మహోదరికి నిప్పుడె
శాంతి నందగ జేసెద సత్యమైన
విప్రవరునకు దగునె యీవికృతులుగ?

(క్రోధవంతుని వలె బరశురాముడు ప్రవేశించును.)

పర (ఎవరిని జూచినట్లు నటించి)

"అలఘు బ్రహ్మవిఘాత దర్పిత బలా
హంకారులన్, వైదిక
క్షుల బాటింపని క్రూరభూపతులచే
గ్రుద్ధుండనై త్రుంచితిన్
బ్రళయాగ్నిత్వర నెల్లరిన్; బరశు వ
హ్నిం దున్ దదస్రంబు రా
శ రతిన్ జూపెడు నేటికిన్, బరశు కృ
ప్తంబయ్యె బల్మారునున్"

"ధర్మపరులైన విప్రుల దమపుచుందు
రెవ్వరెవ్వరు వారు నారెవ్వరైన
నాత్మబలము నొసంగి నిరంతరంబు
ప్రోచుచుందును గురునా ప్రతిజ్ఞమిది."

(తనలో) ఇచట జరిగినదెల్ల వాశిష్ఠుడే మునుపే నాకీ కోప మనవసరము

వసి : భగవానుడా! నమస్కారము.

పర : వసిష్ఠ భగవానుడా! ప్రతి నమస్కారము

విశ్వా : కౌశికుడను విశ్వామిత్రుడు నమస్కరించుచున్నాడు

పర : నీ బ్రహ్మత్వము శాశ్వతముగా విరాజిల్లుగాక!

జన : విదేహాధిపతి జనకుడు నమస్కరించుచున్నాడు

పర :

"గురువువైతి మహర్షులకును మహాత్మ!
దాతవు మహారథుండవై తనరినావు
నీకు గలిగిన కామ్యంబు నెగడ సకల
శుభము లంది వెలుంగుము సూర్యతేజ!

దశ : పావిత్రుడను దశరథుడు నమస్కరించుచున్నాడు

పర : నీ పుత్రులు నీకు శాశ్వత యశ మొసంగుదురుగాక!

రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు : భగవంతుడా! నమస్కారములు

(సగోత్రనామపురస్సరముగా నమస్కరింతురు)

పర : వత్సలారా! దీర్ఘాయుష్కులు పుణ్యయశస్కులు నగుదురుగాక!

ఇతరులు (పరశురామునికి నమస్కరించి యాశీర్వచనము లందుదురు)

పర (జనకునితో)

"రామబలమున శివధను ర్భంగమయ్యె
నని విని తపంబు విడిచి నే నరుగుదెంచి
నాడ వేగంబునన్ దెల్పు నా కదెట్లు?
కేసరికిశోరము గిరి పెల్లగింపగలదె!"

జన (వేదనతో) భగవానుడా! శివధనువును సజ్యమొనరించినవానికి సీత నిచ్చెదనని నేను పణ మేర్పఱచితిని

పర : అది నాకు తెలియును. తరువాత—

జన : అయోధ్యేంద్రుడగు రాము డా ధనువు నుద్ధతితో నెత్త నది భగ్నమయ్యెను.

పర : (రామునితో) ఇది నిజమా?

రామ : భగవానుడా! నా బాల్యచాపల్యము క్షమింపుము

పర : ఏ బాల్యచాపల్యము?

రామ : ఇదే.

"చిరమున నుండియు మిథిలా
నరపాలుని యింటనుండిన ధనస్సది నే
గరమున బట్టిన యంతనె
విరిగి సగమై పడిన యట్టి చిత్రము దేవా!"

పర : ఇదిగో— ఈ నా ధనస్సును గైకొనుము (ఇచ్చును)

రామ : భగవానుని యాజ్ఞ (గ్రహించును)

పర : [illegible] నీ వైష్ణవమగు రూపమును గాంచగంటిని

(తనలో) ఆహా! నా కోరిక సిద్ధించినది

"ఖలులై పాపులునై యధర్మగతులై
గర్వాంధులై మన్నరా
జులు నొక్కుమ్మడి దైవశాసనమువన్
క్రుద్ధాత్మతన్ జంపితిన్
దోలితన్ విశ్రుత సత్తపోవ్రతుండనై
కుట్టుంచెనై యుంటిగా
నిలలోన్ గాని మనోవిచారము మనమున్
బాధించు నొక్కప్పుడున్"

"అంశభూతుడు దైత్యారియైన రాము
చంద్రుడే గద! ధర్మప్రచండు డతడు
నేనొనర్పక విడిచిన నిఖిలదైత్య
మర్దనం బొనరించి క్షేమంబుగాంచు"

(ప్రకాశముగా) వత్సా! దాశరథీ! నీవు వైకుంఠవాసియగు దేవుడవు తపోవనముల నీవు రాక్షసుల వధించిన వృత్తాంతము విన్నప్పుడే పురుషోత్తము డీరాముడే యవతారమున జన్మించెనని గ్రహించితిని. అందుచే స్వప్రయోజనముగా నా ధనువు నీకర్పించితిని

"పాపుల బరిమార్చుటకై
చేపట్టుము నీవు దీని సిద్ధము ధనువున్
ప్రాపించి శరము చాల్చుక
చెలగిదిని మారి గాంచి ... రామా!"

రాము దేవా! ఆట్లే చేయుదును

పర ధర్మమార్గమున నేనే యీ లోకముల జయించితిని. ఆయినను యీ నీకు తండ్రి పరంపరగా వచ్చునట్లిచ్చి వేసి నేను దత్త్వజ్ఞుడనై తపమాచరింప వెళ్ళుచున్నాను.

వసి భగవానుడా! పుణ్యార్జితములైన లోకముల నీ వేల విడిచెదు?

పర :

"కాలవశమున బుణ్యంబు క్షయముగాగ
సారహీనంబులౌ నట్టి సంపదలును,
వానిపైనుండు దాన రతియైన నాస్థ
కాన నేను ద్యజింతు లోకమ్ములెల్ల"

"అల చిదానందమయమైన యట్టి బ్రహ్మ
మరయ శాశ్వత, మది పరాత్పరము దాని
యందు నిత్యస్థితియె మహానంద మొసగు
నంద నేను బ్రహ్మానంద మందుచుందు"

విదూ (తనలో) ఈ ముసలి యొలుబంటి త్వరగా పోయిన మంచిది

పర నే వెళ్ళి వచ్చెదను (శీఘ్రముగా నిష్క్రమించును)

జన ఆహా! జామదగ్న్య మహిత బలశాలివా! అతిసింత పరమ శాంతుడే! ఇక క్షత్రియులు సుఖింతురుగాక!

రాము పరశురాముడాదేశించిన ప్రకారమిక నేను పాపనాశన మొనర్చింపరాదు. పాపులెల్లరిక భలాయమాన విద్రాముద్రితులు, కంపమాన మనస్కులు గాదురు. (నిష్క్రమించును)

దశ పరశురామ భగవానులు సర్వతేజో నిరాకరిష్ణులై బ్రహ్మత్వమందినారు

విదూ (తనలో) ఈ వృద్ధ బుక్షము పడిపోయినదిమ్మట వీరందరు తాతనిని స్తుతించుచున్నారు. ఉండగా స్తుతించుటకు భయమే

విశ్వా ఔనౌను అతని పరాక్రమమున బహు క్షత్రియులు మరణించినారు. అతని బ్రహ్మతేజో మహత్త్వమున నిక నెవ్వరికి నాపద రాదు. మఱియు వసిష్ఠ భగవానుల బ్రహ్మత్వము మాదృశులకు సైతము పొందరానిది. దానిని దిరస్కరింప నే బలసమూహము చాలదు.

వసి అది యిప్పటి మాటయా

విశ్వా (పైకి చూచి) దివ్యాభినందన మంది పవిత్రులరై దశరథకులప్రదీపులు కుమారుల మధ్యమున గూర్చుండి యున్నారు

వసి ఏల?

విశ్వా అదిగో అందఱు పైకి జూడుడు.

అందఱు (పైకి జూతురు)

విశ్వా :

"నలువయు విష్ణువున్ శివుడు
నారద తుంబురు లింద్రుడున్ సురుల్
వారలయి కల్పవృక్షకుసు
మావళి చల్లగ మంగళార్థమై
పలుతెరగుల జిమ్ముచును
సర్వసుపర్వులు జూచుచుండ్రి ని
స్తుల బహు వాద్యఘోషము
తో నిటనయ్యెను పెండ్లి ముద్దుటల్"

దశరథ జనకులు (చూచి) నిజము నిజము

[అంత నలువురు వధువులు నలువురు వరుల ప్రక్క నిలిచి సపరివారముగా ప్రవేశింతురు. దివ్య వాద్య ఘోషములతో నాకసమునుండి పుష్పవృష్టి కురియును]

అందఱు స్వస్తి స్వస్తి స్వస్తి

విశ్వా సఖా! దశరథా! నీకింక నేమి ప్రియము కావలయునో కోరుకొనుము

దశ

"పుత్రులు లేని దుఃఖ మది
పోయిన దప్పుడె మైథిలీశ స
త్పుత్రికలైరి నాకు బరి
పూర్ణ సుఖంబు లొసంగగా నున్నవల్,
క్షత్రియసంతతిన్ బరమ
శౌర్య నిధానము లన్న కీర్తితో
బుత్రులు నొప్పిరింక దల
పోయగ గోరిక లన్య మున్నదే?"

విశ్వా ఐన నిట్లుగాక! రాజసింహాసనమును నీవు పాలింప

"వర్ణాశ్రమ ధర్మంబులు
పూర్ణంబుగ వలయ ప్రజలు పొందగ బహుసం
పూర్ణ సుఖంబులు మఱి నిఖి
లార్ణవ మధ్యస్థ భూమి యలరుత శాంతిన్"

వసి తథాస్తు

[అందఱు నిష్క్రమింతురు, తెరపడును]

(సంపూర్ణము)

# సాత్త్వికభావములు



శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

స్తంభము, చెమటపోయుట, గగుర్పాటు, గద్గదిక భాషణము, వణకుట, వివర్ణత్వము నందుట, కంట తడిపెట్టుట, ప్రలయము ననువానిని సాత్త్విక భావములనుచున్నారు సాత్త్విక భావములకు, అనుభావములకు సామ్యము చాల కలదు ఇవి స్థాయి భావములకంటె విలక్షణములు వీటిని సంచారి భావములుగా కూడ గ్రహింపరాదు

ఆభ్యంతరములుగా ననుభవింపబడునవి సంచారిభావములని, బాహ్యముగా ప్రతీయమానములగునవి స్వేదరోమాంచాది సాత్త్వికభావములని శృంగార ప్రకాశికారుడనువాడు బాహ్యముగా, అనగా శారీరకముగా, ననుభవించువానిని అనుభావములు, (*Sensations*) అని యందురు. ఇవి అంతర్గతమగు భావము ననుసరించి యుండునవి

రసానురూపములగు నాలాపములతో, నానాలంకార సంయుక్తములగు పద, వాక్య, శ్లోకములతో వాచిక రసము కల్గునని, కర్మ, రూప, వయో, జాతి, దేశ, కాలానువర్తులగు మాల్య భూషణ వస్త్రాదికముచే నేపథ్యరసము వచ్చునని, రూప, యౌవన, లావణ్య, స్థైర్య, ధైర్యాది గుణములతో స్వాభావిక రసము రాగలదని మాతృగుప్తుడను వాడు ఇందలి వాచిక రసమును వాచిక శృంగారముగాను, నేపథ్యరసము నాంగిక శృంగారముగాను శారదాతనయుడు చిత్రించినాడు ఇచట రస శబ్ద మనుభావములకు వరింపబడినది నాట్యే పద్య క్రియాత్మకముగా శృంగారము, అంగనేపథ్య వాక్యాత్మకముగా హాస్య రౌద్రములు, త్రివిధములుగా గలవని భరతుడే చెప్పుచున్నాడు కాని ఈ వాదములో అనుభావమును సంచారిభావముగా గ్రహించి, ఆపై స్థాయిభావముగా తీసికొనుట గలదు ఇట్లనుభావమును సంచారిగా స్వీకరించుట ప్రామాదికమని వెనుక వివరించితిమి

అనుభావమనగా నేమి ? బాహ్యజగత్తులోని విషయములతో మనకు సంబంధము కలుగగా వాటిని గురించి కొంతవరకు తెలిసికొనగలుగుచున్నాము ఈ యనుభూతిలో విషయము వేరు. మనలో కలుగు మార్పులు వేరు. సూది గుచ్చుకొనగానే మనకు కలుగు అనుభావములో బాధకలదు. సూది యను విషయములో మనకు కలుగు సంబంధముద్వారా వచ్చు అనుభావమును సాక్షాత్తుగా, అపరోక్షముగా, బాధయని తెలిసికొనుచున్నాము

శరీరమున జీర్ణకోశము మొదలగు వానిలో కలుగు మార్పులు, పరిసరములలో వచ్చు సంచలనములు, మన ఇంద్రియములను సంచలింప చేయుచున్నవి ఈ సంచలనములద్వారా మెదడులో మార్పులు రాగలవు ఈ మార్పు లనుభావములలో ముఖ్యముగా కల్పించును ఒక విషయమును మనసు చూచినపుడు మనలో కొన్ని పరిణామములు బయలుదేరును సాక్షాదపరోక్ష ప్రతీతిలో నంతర్లీనములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములకు పరిణామములు సంబంధించియుండును ఇచట విషయము, మన అనుభావము అను రెండు విలక్షణ వస్తువులు కలవు ఈ యనుభావములు వ్యక్తి భేదముచే భిన్నములగుచున్నవి ఏ వ్యక్తి అనుభవము ఆ వ్యక్తిదే కాని అను భావములు విషయ ప్రత్యక్షమున కలుగుట వలనచే మానసిక వృత్తులు కావలెను అనగా అనుభావముల స్వార్థబోధకము లైనవి వస్తుతంత్రములగుచున్నవి జ్ఞానముచే నుపలక్ష్యములగు అనుభావము లర్థవంతములుగా ప్రతీయమానమగుచున్నవి అతిక్రాంతత్వము, అన్యముఖ ప్రేక్షకత్వముగల అనుభావములు మనస్సుతోనే, బాహ్య విషయములతోను సంబంధము కలిగియుండక తప్పదు అనగా నసమగ్రములు, పరతంత్రములు నగు అనుభావముల ప్రధానము లగుటచే స్థాయి భావములు కావలెను, చిత్తవృత్తి విశేషములు గాక పోవుటచే నివి సంచారిభావములుకూడ కావలెను మన వృత్తు లుద్దీప్తములై ప్రవృత్తిపరములైనపుడు శరీరమున కల్పించు పరిణామములను అనుభావములందురు అనుభావతుల్యములైనవి సాత్త్వికభావములు వీటిని స్థాయిభావములుగా గాని, సంచారి భావములుగా గాని స్వీకరింపరాదు

ఇంద్రియార్థ సంయోగవశమున స్థాయి భావము సంచారి భావముతో నన్వితమై ప్రవృత్తమగుచున్నది. సంచారిభావము నుద్దీపింప చేయగల శక్తి బాహ్య వస్తువున గలదు. ఇట్టి యుద్దీపనము మానసికముగా జరుగుచున్నను, శారీరకముగా నభివ్యక్త

మగుచున్నది. కేవలము శరీరముగాని, కేవలము మనస్సుగాని బాహ్యవస్తువును గ్రహించుట లేదు మనోదేహములతో గూడిన వ్యక్తియే బాహ్యవస్తువు నవగతము చేసికొనగలుగుచున్నాడు

చేతనమైన వ్యక్తియొక్క అనుభూతులు ప్రయోజనసహితములు ప్రవృత్తి భేదముచే ప్రయోజన భేదము వచ్చును మనముచేయు ప్రయత్నముయొక్క తీవ్రత్వాదికము నాధారము చేసికొని ఈ భేదము వచ్చుచున్నది మనము కొంచెము మైమరియున్నచో మన ప్రయత్నమున నీ యేమరిపాటు కన్పించగలదు సంచారిభావ మతితీవ్రరూపమున నుద్దీపితమైన నుద్దిష్టార్థమును గూర్చిన ప్రయత్నము గూడ తీవ్రత నందగలదు ఈ తీవ్రత యున్నపుడు అన్యకార్యాపేక్షగాని, విశ్రాంతిగాని కుదరవు ఇట్టి తీవ్రత ప్రధానముగా మానసికమై, శారీరకముగా నభివ్యక్తమగును సంచారిభావము నుద్దీపించిన సన్నివేశము కొనసాగుచుండినను తీవ్రత తగ్గదు అనగా సంచారిభావానుభూతి మనో దేహ సంవలితమైన ప్రవృత్తి ఈ సంచారి భావములో కన్పించు శారీరకములగు మార్పులద్వారా ప్రవృత్తమగు స్థాయి భావమునకనుగుణముగా శరీరమును సిద్ధపరచుచున్నది

శారీరకములగు మార్పులు రెండు విధములుగా వచ్చుచున్నవి శరీరమందలి గ్రంథుల సంచలనముల ద్వారా శరీర సంచలనములు సంభవించుట యొక విధము వీటిని సాత్త్వికభావము లందురు ఇవి సంచారిభావములవలన బయలుదేరు బాహ్యము భావములు భయముద్దీప్తమై పారిపోవుటకు యత్నము జరుగునపుడు నరములద్వారా గ్రంథులు కదలబారుచున్నవి ఈ గ్రంథులనుండి యొకానొక ద్రవము రక్తనాళములోనికి ప్రవహించును. రక్తనాళముల నీద్రవము ప్రవేశింపజేయగా కాలేయమున చక్కెరవంటి పదార్థముద్భవించును రక్తమీ పదార్థమును కండరములకు తీసికొనిపోగా కండరములు శక్తివంతములై పరుగెత్తిపోవుటకు తోడ్పడుచున్నవి భయక్రోధములుద్దీప్తములైనపుడు శారీరక పరిణామము లతిత్వరగా, అతి తీవ్రముగా నీరీతిగా జరుగగలవు ఈ విధముగ శారీరక పరిణామములలో ముఖ్యమైనవి ఎనిమిది గలవు స్తంభమున కదలిక యుండదు భయము, వ్యాధి, అమితానందము మొదలగువానిద్వారా నిది వచ్చును. క్రోధ, భయ, హర్ష, లజ్జా, దుఃఖ, శ్రమ, రోగ, తాప, ఘాత, వ్యాయామాదులద్వారా చెమట పోయును శీత, భయ, హర్ష, స్పర్శ, క్రోధ, రోగములవలన గగుర్పాటు కల్గును భయ, హర్ష, క్రోధ, జరా, రోగ, మదములవలన స్వరభేదము బయలుదేరును. శీత, భయ, హర్ష, రోష, జరా, స్పర్శములవలన వణకుట కల్గును శీత, క్రోధ, భయ, శ్రమ, రోగ, క్లమ, తాపములద్వారా వైవర్ణ్యము రాగలదు ఆనంద, అమర్ష, ధూమ, అంజన, జృంభణ భయ, శోక, అనిమేష ప్రేక్షణ, శీత, రోగములనుండి కన్నీరుకారును శ్రమ, మూర్ఛ, మద, నిద్ర, అభిఘాత, మోహములు ప్రలయమును తెచ్చుచున్నవి మనోగతభావము లుద్దీప్తములైనపుడీ మార్పులు శరీరమున కన్పించగలవు

సత్త్వమనగా సజీవమగు దేహము ఈ దేహమునకు సంబంధించినవి సాత్త్విక భావములు సాత్త్వికాద్యను భావములు సంచారిభావ జన్యములుగా కన్పించుచున్నను, జేమ్స్ (*James*), లాంగ్ (*Longe*) అను మనస్తత్త్వ శాస్త్రజ్ఞులొక విపరీత వాదమును లేవదీసినారు శారీరకమగు మార్పువలన, అనగా అనుభావమువలన, జనించునది సంచారి భావమని వీరి వాదము మన మేడ్చుటచే శోకమను సంచారి భావము, కొట్టుటచే క్రోధమను భావము, వణకుటచే భయమను భావము వచ్చుచున్నవనుట లోకప్రతీతికి విరుద్ధముగా పల్కుటయే కాని శారీరకములగు అనుభావములు లేనిచో సంచారి భావము లర్థరహితములు కాగలవను ఈ వాద సారాంశము పరమ ప్రామాణికమే

ఒకానొక వేదనను (*Feeling*) తెల్పునది సంచారి భావము వేదన బాహ్యవిషయము నాధారముగా చేసికొని వచ్చునది ఈ బాహ్యవస్తువు కన్పించగానే సంచారి భావ ముద్దీపితమగుచున్నది. స్థాయి భావమును ప్రవృత్తి పరముగా చేయు సంచారి భావమునకు, స్థాయి భావమునకు గల భేదమును జేమ్స్ గమనించలేదు. ప్రతి సంచారిభావములోను వివిధాంశములు గలవనియు, ప్రతి అంశము జ్ఞాతికమగు దేహముద్వారా ప్రవృత్తమగుచున్నదనియు, కాగా సంచారి భావము కేవలము శారీరకమేననియు జేమ్స్ వాదము. అనగా సంచారిభావము (*Emotion*) నకు అను భావ (*Sensation*) మును వర్థమును చెప్పవలసి యుండును. విషయ దర్శనమున కలుగు మార్పులు ప్రవృత్తిపరమగు మనస్సుచేత యంత్రితములై గ్రహింపబడునవి సంచారి భావమను భావరహితమైనచో అర్థరహితమే యగును కాని అనుభావములకంటె విలక్షణమైన సంచారి భావము లేదనుట పొరపాటు శరీరము మొద్దుబారినచో సంచారి భావము ననుభవింపజాలని మాట వాస్తవమే. కాని అనుభావములు, సంచారి భావములు అవినా భావ సంబంధము కలవని గుర్తించవలెను.

అనుపహితమగు మనస్సును సత్త్వమందురు. ఇట్టి మనస్సునుండి భావములు జన్మించుటచే భావములన్నియు సాత్త్వికములే యగునని శృంగార ప్రకాశకారుడనినాడు. కాని సమస్త భావములు సత్త్వమూలకము లగుటచే సాత్త్వికము లైనను, స్తంభస్వేదాదులు కేవలము సత్త్వమునుండి జన్మించుటచే వీటికే సాత్త్విక భావములనుపేరవని సింగభూపాలుడు నిర్ణయించినాడు. మనః ప్రభావమైనది సత్త్వము. సమాహితము మనస్సునుండి వచ్చునది సత్త్వము. మనస్సు సమాధిలో నున్నపుడు సత్త్వనిష్పత్తి జరుగును. ఈ సత్త్వము రోమాంచాది రూపమున వ్యక్తమగుచున్నది. ఒక వ్యక్తియందే వ్యక్తీకరణమెట్లు జరుగుచున్నదో దాని నితరులనుకరించగలరే గాని, తద్భిన్నముగా జూపలేరు. అనగా సాత్త్విక భావములు మానసిక వృత్తులవలన సుత్పన్నములగు అనుభావము లగుటచేత వ్యక్తి భేదముతో భిన్నములుగా భావించగలవు. సాత్త్విక భావానుగతమగు సంచారి భావము సుఖదుఃఖాది హేతుక మగుచు స్థాయి భావమును ప్రవృత్తిపరము చేయుచున్నది. సంచారిభావ సద్దీపితము కాగా తదభివ్యక్తి తోచును. శారీరక పరిణామములే సాత్త్విక భావములని తాత్పర్యము



'సంజవేళ'

చిత్రకారుడు: శ్రీ పేరి సుబ్బారావు, అమలాపురం.

# ఆంధ్రసంస్కృతి



శ్రీ నోరి నరసింహశాస్త్రి

ఆంధ్రరాష్ట్ర మవతరింపవలెనను ఆందోళనము ఎక్కువగుచున్న కాలమునుండియు తరచుగా 'ఆంధ్ర సంస్కృతి' యను పదము వినబడుచున్నది. ఆంధ్రులకు ప్రత్యేకముగా నొక సంస్కృతి కలదా? ఉన్నచో నది యేమి? దాని స్వరూప మెట్టిది? — నిష్పక్షపాతముగా విచారింప యత్నింతము.

ఒక ప్రత్యేక సంస్కృతి యున్నచో నది వారి శిల్పమునను చిత్రకళలోను వాఙ్మయమునందు సంగీతమున, గృహవాస్తువు గ్రామనిర్మాణము పుర నిర్మాణము నౌకా నిర్మాణము, మతము, తత్త్వవిచారము, వేషము, ఆచారములు, సాంఘిక వ్యవస్థలు, ప్రకృతి సిద్ధ సంస్థానము, చరిత్ర—ఇత్యాది సమస్త విషయము లందును ప్రతిబింబించును. అట్టి ప్రత్యేకత యేదైనను ఆంధ్రులకున్నదా?

ఆంధ్ర శిల్పము ఆంధ్రుల చిత్రకళ యని పలుమారులు పత్రికలలో చదువుచుందుము, ఉపన్యాస వేదికలనుండి వినుచుందుము. ఆంధ్ర శిల్పమన్నంతనే అమరావతి నాగార్జునకొండ ఉదహరింతురు. చిత్రకళ యనగానే అజంతా యందురు. పుర నిర్మాణ మన్నంతనే హంపి విద్యానగరము పేరెత్తుదురు. ఇందులో నేవి నిజముగా ఆంధ్రుల సొమ్ములు? వాని ప్రత్యేకత ఏమి?

మనమెంత కాదన ప్రయత్నించినను, అజంతా గుహలు తెలుగు దేశము మధ్యములో లేవు. అవి మహారాష్ట్రము కన్నడము తెలుగు మిశ్రమైన భాగములో నున్నవి. అందును తెలుగక్కడ చాల తక్కువ. అజంతా గుహలు తొలుచుటలోనను అక్కడి కందరములు మలచుటలోనను అందలి చిత్రములు వ్రాయుటలోనను ఆంధ్రదేశమునుండి పని వారు కూడ తప్పక పాల్గొనియే యుందురు. కాని అజంతా ప్రత్యేక ఆంధ్రులదనుట బుద్ధిమంతు లంగీకరించుమాట కాదు.

అటే విధముగా విద్యానగరము! విద్యానగర సామ్రాజ్యమును తరచుగా కర్ణాటక రాజ్యమనువారు. శ్రీ కృష్ణదేవరాయలు మృతి చెందిన పిమ్మట కలిగిన యంతఃకలహములను పురస్కరించుకొని గజపతి విద్యానగర రాజ్యములోనికి దండెత్తిరాగా, అల్లసాని పెద్దన కోపించి ఒక సీసపద్యము వ్రాసి గజపతికి పంపినట్లు చెప్పుదురు. అందులో 'కన్నడంబెట్లు చొచ్చెదు గజపతీంద్ర!' అని ఉన్నది. శృంగేరి విరూపాక్ష పీఠాధిపతుల బిరుద గద్యములలో కూడ వారికి 'కర్ణాటక సింహాసనాధీశ్వరు లను' నామము కలదు. అంత మాత్రమున విద్యానగరము కేవలముగా కర్ణాటకుల దని జెల్లదు. మొట్టమొదట నట్లున్నను దాని యంత్యదశలో తెలుగు నాయకులు మంత్రులు కవులు ఆ సామ్రాజ్యములో ఎక్కువ పలుకుబడి సంపాదించుకొనిరి. ఏది ఎట్లున్నను మొత్తము మీద కన్నడులు ఆంధ్రులు తమిళులు కొంచెముగా కేరళులు కూడ యథాశక్తిగా దాని స్థాపనకును అభివృద్ధికిని తుదకు విచ్ఛిత్తికిని కూడ తోడ్పడిన మహారాజ్యమది! అందుచే హంపిలో ఆంధ్రుల ప్రత్యేక సంస్కృతి కొరకన్వేషించుట వృథాశ్రమ.

ఇక మిగిలినవి అమరావతి, నాగార్జునకొండ—కావున్న భట్టిప్రోలు, ఘంటశాల, గుడివాడ, జగ్గయ్యపేట ఇత్యాదులును చేర్పవచ్చును. ఇవి యన్నియు నిస్సందేహముగా ఆంధ్ర భూమి మధ్య భాగమున వెలసినవే. మరి యైనచో వాని శిల్పములో నొక ప్రత్యేకత యున్నదా? వానిని గూర్చి విచారణచేయు సందర్భములో నవి యన్నియును చైత్యము లన్నమాట మరువక జ్ఞప్తియం దుంచుకొనవలెను. స్తూపమనుమాట సరియైనది కాదు. అది సింహళమునుండి ఎరువు తెచ్చుకొన్న క్రొత్త పదము. చైత్యమనగా చితి సంబంధమైనది. గౌతమ బుద్ధుని యొక్కయూ అర్హతులయొక్కయూ దేహములను

దహనముచేసి శేషించిన యాదియో ధాతు ఖండమో—
దంతమో కల్యమో—భద్రపరచి యా స్థానమును
పూజించి ప్రదక్షిణము చేయు నిమిత్తము ప్రధాన
ముగా నవి యవతరించినవి. ఆ ప్రదేశములను చైత్య
నిర్మాణమునకు పూర్వమో తరువాతనో భరతదేశ
మున నానా భాగములనుండియే గాక విదేశములనుండి
కూడ భక్తులను శిల్పులను ఆకర్షించి యుండినవి
మహాత్ముల దేహావశేషములపై అద్భుతమైన కట్టడములు
కట్టి పూజా ప్రదక్షిణము నొనరించుట ఆంధ్రుల
ప్రత్యేక సంస్కృతి లక్షణ మందుమా? అద్వైతముతో
నట్టి సంస్కారము మనలో బహుశతాబ్దములుగా
లోపించి పోయినది అటు కావున్నను అమరావతి
నాగార్జునకొండ ఇత్యాదుల చైత్య నిర్మాణమునకును
విగ్రహ లక్షణములకును ఇతరాంధ్ర శిల్పములకును
సాజాత్యమేమైన నున్నదా? ఉన్నచో ఏమి?
సాంచీ చైత్య నిర్మాణమునకు వీనికి భేదమేమి? ఉన్న
స్వల్పభేదములును ఆంధ్రుల ప్రత్యేకతను ప్రదర్శిం
చునా? అట్టిది నిరూపించిన వారిప్పటికి లేరు ఏది
యెట్లున్నను తెలుగు దేశములో ఈ చైత్య నిర్మాణ
మాగిపోయి ఎన్నో శతాబ్దములైనవి దాని శాఖ
లిప్పటివియు గనబడవు అందుచే వానిలో నాంధ్ర
త్వమున్నదని పొంగిపోవుట నిష్ప్రయోజనము

ఇక నేటి కాలపు చిత్రకారులున్నారు
వారిలో కొందరు శ్రీ ప్రమోద కుమార ఛటర్జీ
శిష్యులు పెక్కురు శ్రీ దేవీ ప్రసాదరాయ శిష్యులు
కొలదిమంది శాంతి నికేతనము వెళ్లి యభ్యసించిన
వారున్నారు అంతకంటెను కొద్దిమంది బొంబా
యిలో స్కూలు ఆఫ్ ఆర్ట్సులో ఆంగ్లేయ చిత్ర
కారుని యొద్ద నేర్చినవారు చివరి తరగతిలో కథా
మాత్రశేషుడైన దామెర్ల రామారావు ముఖ్యుడు
అందరును బుద్ధిమంతులే చక్కని చిత్రములు
వ్రాయుచున్నవారే! కాని వీరిలో ప్రత్యేకాంధ్రత్వ
మున్నదా? ఆంధ్రశైలి యనదగినది వీరు నిర్మించి
నారా? వారు చూపుచున్న యాంధ్రత్వము పూర్వము
నుండి అనుస్యూతముగా వచ్చుచున్నదా? తద్విదు
లైనవారు అట్టిదున్నచో దానిని స్థూలముగానైన
నిరూపింపగలరా?

ఇక సంగీతమున్నది త్యాగరాయల వారి పేరు
చెప్పకొని మనము మురిసిపోవుచుందుము. కాని
వారితో సహా మన సంగీతవిద్వాంసులకు అభిమాన
మైనది 'కర్ణాటక సంగీతము' కదా! త్యాగరాయలు
స్వచ్ఛముగా తమిళదేశ మధ్యమున పుట్టి పెరిగినవారు
ఆయన సంప్రదాయమును పోషించుచున్న వారిలో
తమిళులే అగ్రగణ్యులు; కర్ణాటకులను ఆంధ్రులను
వారి తర్వాతనే గణింపదగినవారు. త్యాగరాయ
లున్న ప్రాంతములో ఆ కాలమున తెలుగు రాజ
భాషగా నున్నందుననో మరి యే కారణముననో
ఆయన తెలుగులో కృతులు చెప్పుట తటస్థించినది.
ఇక తరంగ కాలక్షేపములనది మహారాష్ట్రులు అభం
గములను మన వారనుకరించుటచే వాడుకలోనికి వచ్చి
నట్లు తోచును మరి మిగిలినది తాళ్లపాకవారి పద
ములు అధ్యాత్మ సంకీర్తనములు క్షేత్రయ్య పదములు
ఇట్టివి వీనిలోనైన విలక్షణమైన ఆంధ్ర సంగీత
మున్నదనగలమా? సంగీతశాస్త్రవిమర్శకు లింకను
అట్టిది విశదపరుపవలసి యున్నది

మరి పురనిర్మాణము గ్రామ నిర్మాణము,
గృహ నిర్మాణము—వీనిలో నాంధ్రుల ప్రత్యేకత
యున్నదా? పూర్వము దక్షిణదేశమంతటను ఒక రీతిగ
వాస్తుశాస్త్రమనుసరించి కట్టబడుచుండిన మండపా
ఇళ్లును అంతట నొకటే పద్ధతి నేటి కాలములో
పాశ్చాత్యానుకరణముతో వెలయుచున్న మందిర
ములు పదేళ్లకొకసారి మారిపోవుచున్న క్రొత్తక్రొత్త
తీరులతో నవతరించుచున్నవి ఇందులో నే
సంస్కృతి కనిపించుటలేదు గ్రామ నిర్మాణము
పుర నిర్మాణమందును సంతే! ఆంధ్రుల ప్రత్యేకత
ఏమియు వానిలో కనబడదు

ఆంధ్రనౌకలు ఒకానొకప్పుడు తూర్పు సము
ద్రమునకే కాక పశ్చిమ సముద్రమునను దక్షిణ సము
ద్రమునను పసిఫిక్ అట్లాంటిక్ మహాసముద్రము
లందును నిరంతర సంచారములు చేసియుండెను
నేను చూడగా తూర్పు సముద్రతీరమందంతటను
నౌకలలోను నావికులలోను సాజాత్యమున్నది కళిం
గులకును తెలుగువారికిని తమిళులకును భేదమగపడదు
ఇప్పటికిని బర్మాలో తెలుగు వారిని కూడ క్లింగు
లనియే వ్యవహరింతురు. ఆంధ్రనౌకలలోను నావికుల
లోనను విశిష్టతయున్నచో విదేశీయులైన నది గమ
నించి యుండరా? పూర్వము కోటిపల్లినుండి ఆంధ్ర
నౌకలు ప్రపంచ సంచారముచేసి 'సప్తద్వీప పర్యస్తు

సందోహంబుం దనకిచ్చు నెచ్చెలి సముద్రుం బ్రీతి గావించిన దినములలో నెట్టిదైన ఆ శాఖలకు విశిష్టత యుండె నేమో! అదియును మునుముందుగను బ్రత్యక్ష బయలు పెట్టవలసి యున్నది.

ఆంధ్రులకు ప్రత్యేకమత మొకటిలేదు ప్రత్యేకముగా నాంధ్రాచారములును లేవు ఒక్కొక్క కులమునకు ప్రత్యేకమైన యాచారము లున్నవి, వస్త్రాదిధారణ విధానము లున్నవి కాని కట్టులోగాని జుట్టులోగాని బొట్టులోగాని ఇది యాంధ్రమైనదని వేరుగా నేమియు లేదు

తత్త్వవిచారణలోగూడ ఆంధ్రులకు ప్రత్యేకత లేదు భరత ఖండములో వ్యాపించిన సమస్త తత్త్వ విచారణలకును ఆంధ్ర విజ్ఞానవేత్తలును యథాశక్తిగా సహాయపడినారు

ఎంతదూర మట్లు విచారించుకొనిపోయినను సర్వతోముఖమైన ఆంధ్ర సంస్కృతి ప్రత్యేకముగా నొకటి యున్నట్లగపడదు ఆంధ్రులకు ప్రత్యేకముగా నున్నది భాష యొక్కటే! అందులో నెన్ని యవాంతర భేదములున్నను ఇది యాంధ్రభాష యని చెప్పదగినది విస్పష్టముగా నొకటున్నది అందుచే నాంధ్రుల ప్రత్యేక సంస్కృతి యేదైన నున్నచో అది ఈ భాషా పరిశ్రమయందే యుండవలెను ఏమి టది?

ఆంధ్ర వాఙ్మయ కర్తలలో పూజ్యులగువారు మొదటినుండి ఇప్పటివరకు ఆసేతు హిమాచలభూమిని ఏకముగా సంధానము చేయుచున్న సంస్కృతభాషా ప్రభావము కలవారు సంస్కృత భాషాసాంగత్యము లేని యాంధ్రకవి ఱెక్క విహీనమువంటివాడే నన్నయనుండి శ్రీ విశ్వనాథ వరకు నంతే! సంస్కృత భాష నుండియే ఆంధ్రము పుట్టినదనువారి వాదము సత్యము కాకపోయిన నేమి! ఆంధ్రకవుల చేతులలో ఆంధ్రభాష సంస్కృతభాషా సంప్రదాయములలో నడచినది. ఆంధ్రకవులలో కేవలావేశపరులు లేరు శివమెత్తి మైమరచి ప్రలాపించు కాముకులకు వారిలో పూజ్యస్థానము లేదు వారందరు నొక పరిపూర్ణత కలవారు, ఆత్మనిగ్రహము కలవారు వారు వాఙ్మయోపాసకులు, అక్షరరమ్యతా వేదులు. అనంతమైన విశాలవిశ్వమును అందున్న ఊహాతీతమగు వైలక్షణ్యము లక్షించుచునే తమ యాత్మలోనికి, పూర్ణముగనె తమ యింద్రియములను సంకోచము చేసికొనగల యోగీశ్వరులు. వారి యభిమానమునకు పాత్రమైనది భరతఖండమే. అయినను అది భరతవర్షములో నొక భాగమనియు, అది మరల జంబూద్వీపములో నొక భాగమనియు నిత్యము ముప్పూటల స్మరించు నాచారము కలవారు. వారే కాలములో నున్నవారైనను కాల మనంత మని దాని ప్రభావ మెరిగినవారు ఒక కాలములో ఒక దేశములో ఒక ఉపాధి చేకొని ఈనాడు జన్మించియున్నను, కాలాంతరమున దేశాంతరమున ఉపాధ్యంతరము చేకొని జన్మించి యుంటిమనియు, ముందు జన్మింపగలమనియు వారెరుగుదురు శ్రేయోమార్గము వారి కెరుక అభ్యుదయము వారి కభిమానము తెలుగు కవులు ప్రత్యేకముగా నుపాసించినది శ్రీకారము శ్రీకారము ఆంధ్రకవుల సంస్కృతి చిహ్నము పూర్వమాంధ్ర నావలు ద్వీపాంతరములకు శ్రీకారము చిత్రింపబడిన ధ్వజములు స్తంభములపై నాట్యము చేయుచుండ సప్తసముద్రములలో ప్రయాణములు చేయుచుండెడివని చరిత్రకారులు చెప్పుచున్నారు ఆంధ్రకవులు ఆద్యులైన ఋషుల సంతతిలోని వారు ప్రత్యేకముగా నాంధ్ర సంస్కృతి యేదైననున్నచో నది యాంధ్ర కవులు వాఙ్మయరంగములో ప్రదర్శించిన ఆర్షదృష్టియే!

ఆంధ్ర సంస్కృతి ఇతర రంగములలో లేకపోవుటకు ముఖ్య కారణములు రెండు. ఒకటిప్రకృతి సిద్ధమగు సంస్థానము. రెండవది చరిత్ర

ఆంధ్రదేశము ప్రకృతి సిద్ధమగు స్వరూపము గమనించినచో వైవిధ్య మెక్కువ కనిపించును కొంత పర్వతమయమైన భూమి, మరికొంత తీర భూమి, కొంత మైదానము, కొంత తృణ జల సంపూర్ణము, కొంత నిర్జలము ఇంతే కాదు. దీనికి స్వభావ సిద్ధమైన ఎల్లలు లేవు తూర్పున మాత్రము సముద్రమున్నది. ఉత్తరమునగాని దక్షిణమునగాని పశ్చిమమునగాని దానికి వైజమగు హద్దులు లేవు. సరిహద్దులు నిర్ణయించుట యందుచేతనే మనకు కష్టతరమగుచున్నది ఆంధ్ర వాఙ్మయ సంస్కృతి దాని వీర్యపటుత్వమువల్లనే దక్షిణమున కావేరీ తీరమును గూడ దాటి విజృంభించినది. తంజావూరమే కాక మధురకూడ దాని విద్యాయంత్రశాల యైనది.

పశ్చిమమున కల్యాణకటకమే కాక పూనాప్రాంత ములు కూడ వాని క్రీడాస్థానములైనవి ఆంధ్ర వార పత్రికయు సంవత్సరాది సంచికలను ప్రథమములో బొంబయినుండియే వెలువడి యాంధ్రదేశము నారు మూలలకు ప్రసరించిన దని మనము నిరంతరము స్మృతిలో నుంచుకొనవలెను ఉత్తరమున నది మహా నదిని సమీపించి నాగపురము కటకము కూడ నది ప్రవేశించినది ఇప్పటికిని ఓఢ్ర కవులు తెలుగు కవిత్వము కూడ చెప్పగలుట తమ ప్రతిభకు నికషముగా భావింతురు ఆ పైకి మగధములోనికి గూడ మెల్ల మెల్లగ నది దారులు చాపినది ప్రకృతి సిద్ధమైన ఎల్లలు లేకుండుటయే నిరాఘాటముగా నది దూర ప్రయాణములు మెల్ల మెల్ల చేయగల్గుటకు కారణము

మరి యాంధ్రుల చరిత్ర విచారించినచో నట్టిదే ఇంకొకటి తేటపడును ప్రస్తుతము తెలుగు భాష ప్రధానముగా జనులు మాట్లాడుచున్న భాగమంతయు ఎన్నడును ఒక్క ప్రభుత్వముక్రింద లేదు కాకతీయులలో గణపతి దేవుడు రుద్రమ ప్రతాపరుద్ర దేవుడు— ఈ ముగ్గురి కాలములో మాత్రము ఆంధ్ర దేశములో చాల వరకు ఒకే ప్రభుత్వముక్రింద నుండుట తటస్థించినది అప్పుడే 'ఆంధ్రోర్వీశ'లను పేరు వారికి లభించినది కాని యదియంతయు నొక శతాబ్దము కంటె మించక తక్కువగు స్వల్పకాలమే అది జరిగి ఏడు శతాబ్దములు దాటినది అంతకు పూర్వముగాని ఆపిమ్మట కాని ఆంధ్రులకు ఒక దేశముగాని ఒక ప్రభువుగాని ఒక రాష్ట్రముగాని ప్రత్యేకముగా నుండలేదు.

భరత ఖండము స్వభావసిద్ధముగా వింధ్య పర్వత శ్రేణిచే రెండు ప్రధాన ఖండములుగా విభజింపబడుచున్నది. ఈ రెండు ఖండములును ఎప్పటికైనను వేరయిపోవు నవకాశము లున్నవి అట్టిదానికి సూచన లిప్పుడే కనబడుచున్నవి హిందీని రాష్ట్ర భాషగా చేయ నిశ్చయించినప్పటినుండియు ఇది పరి పరి విధములుగా తల చూపుచునే యున్నది. అది గాక ఈ రెండుఖండములు సంస్కృతిలో కూడ నిప్పుడు విశేష భేదమున్నది. విదేశీయుల తాకుడులు ఎక్కువగా ఉత్తర ఖండమును తగిలినవి అందుచే నక్కడ ప్రాచీన భారతీయ సంస్కృతి విచ్ఛిన్న ప్రాయమగుచున్నది దక్షిణ ఖండమో? అది యంత యలజడి పొందలేదు అందుచే పురాణసంస్కృతి ఇంకను కొంత యక్కడనే శేషించియున్నది. ఉత్తర ఖండములో కొందరపా టెక్కువ దక్షిణ ఖండములో జాడ్య మెక్కువ ఈ రెండు ఖండములను ఎప్పటికి చీలిపోకుండుట భరతఖండమునకు శ్రేయస్కరము కాని తప్పని సరియై చీలిపోయినను ఒకరి గొంతు ఒకరు కోసినను శత్రు ఖండములుగా గాక తండ్రియాస్తి మైత్రితో పంచుకొను నిద్దరు సోదరుల విభాగముగానైన పరిణమింపవలసియున్నది ఈ భారము ఎవరిపై నున్నది?

దక్షిణ ఖండములోని సంస్కృతియంతయు కలి ఉత్తర ఖండమునకు మిక్కిలి సమీపముగా నున్నది మనము, తెలుగు దేశములోనివారము ఈ భాగ్యము మనతోపాటు మహారాష్ట్రులకును గలదు ఆంధ్రులకును మహారాష్ట్రులకును అనాదిగా సన్నిహిత సంబంధమున్నది ఈ రెం భూభాగములే భరత భూమికి మధ్య భాగములో నున్నవి అది కీలక స్థానము శాంత సుశీలురైన ఆంధ్ర మహారాష్ట్రములు శాంతి సుఖములైన భరతఖండమునకే పునాదులు కృష్ణా గోదావరి నర్మదానదులే గంగా సింధు నదుల పవిత్ర వారిని కావేరీ తామ్రపర్ణీ పుణ్య తోయములతో మేళము చేసి వింధ్య పర్వత గర్వమును నిర్మూలింప సమర్థమైనవి. అఖిల భారత సామరస్యము సాధించు భారము ఆంధ్రులపైనను మహారాష్ట్రులపైనను ప్రధానముగా కలదు.

ఇది వేయేండ్ల క్రిందట తెలిసికొనిన నాద్యాంధ్ర కవి నన్నయభట్టారకుడు! ఆంధ్రరాష్ట్ర మవతరించినచో ఆంధ్ర కవులు వాఙ్మయ రంగములో ప్రదర్శించిన విశాలదృష్టినే సమస్త రంగములలో నిర్వహింప చేయుదురుగాక!

# సంసారం



శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ

'అహోబలరావు' ఆ కాలేజీ క్రొత్త లెక్చరరు. అతను ఉదయం లేస్తూనే ఒక అపూర్వపు పనిచేశాడు. తత్పర్యవసానంగా పంచొమ్మిది సైకిళ్లు పాతిక కారులు పావు డజను లారీలు ఒక గ్రోసున్నర రిక్షాలు ఎక్కడివక్కడే సడెన్ బ్రేకులు త్రొక్కుకుని స్తంభించిపోయినై.

అక్కడికి కొంతమంది కార్యకర్తలు పోగయ్యారు. వాళ్లు ఉపన్యాసాలు దంచి సందేశాలు ఇచ్చే రకంగాదు. ముఖ్యంగా ఆ వాళ్లకు అందులో వయసులో చిన్నవాళ్లకు ఏదన్నా ఆపద వస్తుందా మనం సేవచేద్దామా అని కాసుక్కూర్చుంటారు. ఈ అవకాశం ఎట్లా లభించిందంటే—

నర్సరావుపేట జంక్షనులో—రైలు కూడా అంతక్రితమే రావటంవల్ల పెద్ద స్టేషనునుంచి వచ్చే ప్రయాణీకులు, మామూలుగా కోటావారి పనులమీద తిరిగే జనాభా, చిన్న చిన్న సందుల్లోంచి 'హూరీ-నారీ' కోసం ఎప్పటికప్పుడు గెంతుకుంటూ తిరిగే బీదా సాదా, వాహనాధిపతులు అందరూ కలుస్తున్నారు అక్కడ ఆ సమయం ఎనిమిది గంటలప్పుడు.

అటువంటి మాంఛి యమరద్దీలో, పోలీసు కనిస్టేబులు తెల్లబోతున్నాడో, అభయహస్తమిస్తున్నాడో తెలియని పరిస్థితిలో, ఓ కాలేజీ భామిని, ఆ గోడుగుడు—గను చూసి తను తెరిచేలోగా—రెండు వందల డెబ్భై డిగ్రీల ప్రదక్షిణాన్ని పూర్తిచేసి, అపర సత్యభామాదేవిగా త్రొక్కుకుపోతున్నది సైకిలును.

అహోబలరావు అప్పుడే కాఫీనిమిత్తం బయల్దేరి వస్తున్నాడు. స్థానిక, దినపత్రికా సాంస్కృతిక వారపత్రికా విలేఖరులు కూడా చూస్తున్నారు. 'స్కూప్' దొరక్కడిగాభపడి. అదిగో షార్లెట్ సిల్కు చీర రెపరెపలు సైకిలు పెడలుతో సరాగాలాడ్డం అహోబలరావు చూశాడు. అతని డబల్ బ్రెస్ట్ కోటు నుండీ 'ఫట్'మని తెగింది.

'అరె ర !!!' అంటూ నిస్తుబ్ధోయి రోడ్డు కష్టం బడ్డాడు.

ఇక ఆ నవీనాంధ్ర యువతి అహోబలరావు ఆశ్చర్యానికి గుండె చెదిరి, అమాంతం చెదిరి, త్రొక్కుతూ త్రొక్కుతూన్న సైకిల్ని ఎదురుగుండా వస్తూన్న రిక్షాకు రాసి, ప్రక్కనే రోడ్డు వారగా పెరుగుతట్ట నెత్తిన పెట్టుకొని తనదారిని తను పోతూన్న ఓ నడివయస్సు గొల్లమనిషిని అమాంతం వెనకనుంచి ఢీకొన్నది.

ఒకడు ఆ అమ్మాయిని లేవదియ్యబోయాడు 'నను ముట్టకు ముట్టకు మని కురుజనంబుల లోనికి మారిన ద్రౌపది యుంబోలె' లేచి దూరంగా నిల్చొని, ఆ చక్కటి విశాలమైన నేత్రాలలో కన్నీటి కదలికల నాట్యరచనేర్పడగా, చిందులోపాగింది చీరను. మరొకడు ఆ లేడీ సైకిలు హేండిలుకు వంకర్లు సాగదీశాడు ఇంకొకడు దూరంగా దొర్లి ఉన్న దలోపడ్డ పుస్తకాల నేరి, స్వయంగా తుడిచి, చేతి కందిచ్చాడు వేరొక ప్రాప్తకాలజ్ఞుడు 'టించర యోడిన్' కోసం పరుగెత్తాడు

తరువాత ఆ అమ్మాయి రిక్షాలో కూర్చుంది

ఒక పెద్దమనిషి ఆవంకర సైకిలును ఎట్లాగో నడిపించుకుని వెనకాలే వెళ్లాడు

ట్రాఫిక్ రూల్స్ తెలియని అహోబలరావు 'గప్ చిప్'గా కాఫీహోటల్లోకి దూరాడు

ఏపాప మెరుగని పెరుగుతట్టలమనిషి, చెల్లా చెదరైన విడతల్ని ముంతల్ని ఏరుకుంటూ 'వయసుకుచే గుంటలకి పొగరెక్కువై పోయాలు, ఎవర్ల కాలమొచ్చినదయింది.' అని గొణుక్కుంటోంది.

## 2

అహోబలరావు కాలేజీ మర్దీవం ఒకటి వెంటొకటి అవకతవకాలు, పొరపాట్లు, తుడుపులు కొట్టివేతలూ దిగాలుపడి చూస్తుండిపోయాడు. హోటలు కొచ్చాక గదితలుపులు తెర్చుకుని చూస్తున్న అతనికి ఆలివేలు, ఆలివేలు వ్రాసిన ఉత్తరాలు, తనచేత అన్నిపనులు సక్రమంగా చేయించగల ఆమెలోని చైతన్యశక్తి, అన్నీ ఒక్కటొక్కటే గుర్తుకు రాసాగినై. జేబులోంచి యిదివరకు ఆమె వ్రాసిన ఒక ఉత్తరాన్ని తీసి చదువ నారంభించినాడు.

'నాకు మిమ్మల్ని ఎట్లా కాపాడుకోవాలో ఎవ్వరూ నేర్పలేదు. కనీసం కొన్ని సూచనలనన్నా చేసివుండలేదు. మా నాన్న నాకు కొద్దిచదువే చెప్పించాడు. మా అమ్మ వంటపటి అంటించటం అంట్లు తోముకోవటంలాంటి యింటిపనులన్నే నేర్పింది. నేను నా స్నేహితుల్తో ఆటీ పాటీ, సంగీతము ముగ్గులు, చింతపిక్కలు, గచ్చకాయలు, క్రొదాట, క్రొత్తగు బిళ్ళలతోటే వ్యర్థంగా గడిపేశాను. నా చిన్నతనమంతా నాకున్న మిడిమిడి జ్ఞానంతోనే 'అది అట్లా కాదు యిట్లా—యిది యిట్లా కాదు అట్లా—' అంటూ వేధిస్తున్నాను. దాన్నే మీరు నన్ను సంస్కరిస్తున్నారనే పెద్ద ముక్కవేసి నాపరంగా వాడుకున్నారు. 'నాకేమి తెలుసును ? నేను చాలా అప్రయోజకుర్ని' అనకండి, ఎవరికున్న ప్రయోజకత్వం వారికుంది. అంతా మీకన్నా ఎన్నో అంతస్తులు పైనవున్నట్లు మీరు యెంచుకుని భావించకండి. ఎవరైనా పరిహాసిస్తూ మాటలంటే, అవన్నీ మనస్సుకు పట్టించుకుని బాధపడ్డం భావ్యం కాదు.'

ఇవన్నీ ఒకటివెంటొకటి జ్ఞాపకాని కొస్తున్నై. జరిగిన విషయాలను అక్షరాల్తో పొదిగి అర్ధాంగికి తెలియపర్చటాని కతని కలం కేదో సిగ్గనిపించింది. కాని వెంటనే ఆ అమ్మాయి విన్నపం గుర్తు కొచ్చింది. 'సమర్థురాల్ని గాకపోయినా అప్పుడప్పుడు మీరు పొందే సుఖదుఃఖాల్ని యీ చరణదాసికి తెలిపి కూడా చేస్తూవుండండి. అందువలన ఎక్కువఫలితం వున్నట్లు కనుపించక పోయినా, ఎలుకా సింహమూ కథ గుర్తుకొచ్చి ఒక రకమైన తృప్తికలుగుతూంటుంది. నేనుకూడా ఏమైనా చేయగల్ను అవుసరం వస్తే మీకు' అని.

అతనిక వుండబట్టలేకపోయాడు. సొరుగులోంచి కాగితాలు కలమూ లాగి బల్లముందు కూర్చున్నాడు. బలవంతాన కళ్ళలో నీరు తిరుగుతున్నా ఆపుకుందుకు యత్నిస్తూ కలంతీసి వ్రాయ నారంభించాడు.

'నీకు వ్రాయకుండా యీ నా అసమర్థతల్లా తెలివితక్కువతనమంతా కలిగే ఫలితాలను నేనే అనుభవిద్దామనుకున్నాను. కాని నీకు ఏ వాగ్దానమైతే యిచ్చానో దాన్ని ఉల్లంఘించే శక్తి నాకు లేదు. క్లుప్తంగా చెప్పాలంటే నువ్వనుకున్నట్లుగానే జరిగింది. మొదట్నుంచీ జాగ్రత్తగానే వున్నాను. బలహీనత ఎక్కడా బయటపడ నివ్వలేదు. కాని యీ బెజవాడ ప్లాటుఫారంమీద అడుగుపెట్టిన మరుక్షణంనుంచి అంతా మారిపోయింది. ఏ పనులు చేయవద్దన్నావో అవే చేస్తున్నాను. వేటిన్నిగూర్చి ఆలోచించి మనస్సు పాడుచేసుకోవద్దన్నావో వాటిన్ని గూర్చే ఆలోచిస్తున్నాను.

నేను 'గాబరా' మనిషినవటం వల్ల ప్రతీదీ ముందే విపరీతంగా వూహించుకుని పప్పులో అడుగు వేస్తూంటాను. ఈ ప్రిన్సిపాలు దగ్గరకు ఇదివరకు నే నీయనవద్ద చదువుకున్నాను. కాని పూరా సూటులో వెళ్ళగానే నాకు ఆసనమిచ్చి చాలా మర్యాదచేశారు. నా పేరుచెప్పి 'ఆర్డర్' చేతిలో వుంచాను. ఆయన ఆశ్చర్యపడి నోరుతెరిచాడు. కాస్సేపటికి నవ్వి కరచాలనం చేస్తూ—'మిస్టర్ అహోబలరావ్ నువ్వు చాలా మారిపోయావే' అని నా ఆర్డర్ అందుకుని రెండేరెండు ఖాళీలు యింగ్లీషు డిపార్ట్‌మెంట్‌లో ఏర్పడ్డాయనీ, ఒకదాంట్లో ఒక అమ్మాయిదూరిందనీ, రెండవది ఖాళీగా వుందని చెప్పారు. నేను సరే అని తలూపాను. ఇక్కడో విషయం వ్రాయటం మర్చిపోతున్నాను. నే నివ్వాళ్టి ఉదయం జంక్షన్లో ఓ అమ్మాయి సైకిలు మీదనుంచి పడిపోవటాన్ని చూశాను. న్యాయంగా చెప్పాలంటే ఆ పడిపోవటానికి నేనే కారణమైనానని వ్రాయటానికి నాకు చాలా సిగ్గుగా వుంది. ఆ మొదటి లెక్చరరు ఆమె కాలేజీకి సైకిలుమీద వస్తూ పోతూంటుందని విన్నాను. కాని ఆవిడను నేను చూడలేదు

అట్లా అనల్యాస్త్రీ ఎవరో తెలుసుకోకుండానే యీ సైకిలు మీద నుంచి పడ్డ అమ్మాయే ఆ మాలోటి లెక్చరరు అనుకున్నాను అట్లా ఎందు కనుకున్నా నంటే నేనేమీ చెప్పలేను ఊహాపడ్డం మాత్రం జరిగింది.

నాకు రోజుకు సుమారు మూడు గంటల పని. తతిమ్మా సమయాల్లో కాంపోజిషన్ గ్రంథాలు సంస్కరించాలి నన్ను మొదటి సంవత్సరానికెళ్లి 'గద్యం' క్లాసు తీసుకోమన్నారు అది సులువే— నాకు బాగా వచ్చు కాని యీ గాబరా పోక టాయె—కడుపులోంచి దేవేస్తున్నది విన్నా నెన్నడూ పది మందిలో ఉపన్యాస మిచ్చిన వాణ్ని కాదు నాలుక పిడచ కట్టింది గొంతుపొర్లు కాబోలు కాఫీ త్రాగినా ముచ్చెమటలు పోశాయి ఒణుకుతూన్న కాళ్లతో ఎల్లి కుర్చీలో కూలబడ్డాను అనేక జతల కళ్లు నావైపు తిరిగాయి. చాలా తిలకా యాలు అలుముకున్నట్లు చెట్టి పిసతిల దొంతరలాగున అగుపించాయి ఎలాగో అటెండెన్సు వేసుకున్నాను దాని, తగలేస్తే అప్పుడే అవాంతిరం రావాలా? మొదటి పాఠం తెరిచి వ్యాసకర్తను గూర్చి గొంతు ముక్కలు చెబుదామని గొంతు విప్పబోతున్నాను

ప్రొద్దున్న సైకిలు మీద నుంచి పడిన ఆ అమ్మాయి పుస్తకాలు ఒళ్లో అదో పుచ్చుకుని, గుమ్మందాకా వచ్చి నన్ను చూసి ఆశ్చర్యపడి అటుగు జవక్క లేచి నిల్చినట్లుగా, నాకు తోచింది

చటుక్కున తవ్వుకున్న గోతిలో పడ్డాను అప్పలామెను పలకరించక పోయినా బాగుండి పోయేది.

'ఇది మీ క్లాసా?' అని అడిగాను

'అవును నా క్లాసే ' అంది యింకా పొగరు పోతు తనంగా చదువ్రా! ఈ అమ్మాయి లెక్చ రరు—యీ క్లాసు అనిపదేకాబోలు ఎరక్కపోయి చిక్కడ్డాను యిందులోనని, తెప్పిల్చుకుందామనే ఉద్దేశంతో—

'సారీ! ఇది నా క్లాసనుకున్నాను టైం టేబుల్లో అల్లానే వుంది పొరపాట్లు జరుగుతూం టాయి. మీ క్లాసైతే మీరే తీసుకోండి' అని మహా వణుకుతో పుస్తకం మూసి యివతలకొచ్చి నేరుగా 'ప్రిన్సిపాలు' రూములో కెళ్లాను. యీ అనర్థకరం సంగతి ఏదో గట్టిగా అనుక్కుందామని

ప్రిన్సిపాలుగారు నా అవివేకానికి నవ్వుకున్నారు 'నీలో ఏదో మార్పు వచ్చిందనుకున్నాను. నవ్వొద్దు మునపట్లానే వున్నావే' అని తరువాత తెలిసింది—ఆ అమ్మాయికూడా విద్యార్థినేనని. నే ననుకున్నట్లు లెక్చరరు కాదని

నాకిప్పు డిల్లు కదలటానికే సిగ్గుగావుంది గదిలి బయటకెళ్తే అంతా పకపకా నవ్వుతున్నారు. ఆ పిల్లలు నేను వస్తూంటే, 'లెఫ్ట్! రైట్!' అని కదం తొక్కుతూ పాడుతున్నారు. నే నందరికీ లోకువైపోయాను తోటి లెక్చరర్లు నన్ను వేళాకోళం పట్టిస్తున్నారు ఈ జాడను పొట్టను పోషించుకోవటానికి వచ్చినవాణ్నే 'దయా-జాలి' యీ కాలేజీపత్రవాళ్ళలో, కోసినా ఏ ఒక్కరికీ నామీద లేదు

ఏం చెయ్యను అలివేలూ? అంతా నన్నూ నా బ్రతుకునీ హేళన చేసేవాళ్లే

నీ

అహోబలం వు

## 3

క్లబ్బునుంచి పెందరాళే వచ్చిన ప్రసాదరావు టెన్నిస్ రాకెట్ను వూపుకుంటూ మెట్లెక్క వస్తున్నవాడల్లా ఎప్పుడూ లేని యీ యింట్లోని స్తబ్ధతకు కొద్దిగా ఆశ్చర్యపడుతూ, బయటే పేము కుర్చీని జాజిపందిరికు దగ్గరగా లాక్కుని అందులోకి ఘటాన్ని జారవేశాడు

ఈ సమయానికి యిల్లంతా మార్మోగించే లతికా పలకటం లేదు మనుష్యులంతా ఎక్కడా కదలటం లేదు చివరకు యింట్లో ఎవ్వరూ లేరా అని అనుమానం వేసింది క్షణంలో జాజిపందిరిమీదనుంచి వచ్చే సువాసనకు అతను యీ అనుమానాలన్నీ కట్ట కట్టి ఒకమూల త్రొక్కి విశ్రాంతి ననుభవిస్తూ మెడను కుర్చీమీద వ్రేలాడేసి కళ్లు మూసుకున్నాడు. కళ్లుమూసుకోవడ మేమిటి ? ప్రసాదరావుకి వెంటనే నిద్రాదేవి వచ్చి వొళ్లో వ్రాలుతుంది. అట్లానే నిద్రపోయాడు.

వరండాలోని ప్రసాదరావు వరండాలోనే నిద్రపోతున్నాడు. హాల్లోని దమయంతి వినుక్కుంటోంది—

'అక్కడ్నుంచి యీ పాటికైనా తిరిగివస్తే బావుండును, డాక్టరుకు కబురు చెప్పేవాళ్లు లేరు ఇక నేనైనా వెళ్తాను ' అని విజయ వుడుకుపోతూ తనంగా అంది

'నువ్వు ఆ డాక్టర్ని వాళ్లని తీసుకొచ్చావంటే నామీద వొట్టే అక్కా ఐతే నాసంగతి వలువ ల్లోనూ పెట్టి నన్నేడిపించాలని వుందన్నమాట మీకు ' యీ చివరి ముక్కలంటూన్నప్పుడు విజయ నిజంగా ఏకువుఘుఖమే పెట్టిందన్లే వుంది

దమయంతి విజయకు దగ్గర పావచ్చి చేతుల మీదరాస్తూ—

'ఈవేళ ఎంతగండం గడిచి బ్రతికేవే— చెప్పు ఈప్రపంచంలో ఎవరైనా నవ్వుతారని వైద్యం మానుకుంటారా? గోటితో పోయేటిదే పోయేది ' మాటకు మధ్యలోనే అడ్డంవస్తూ 'వీల్లేదే అక్కా, నీకు పదివేల నమస్కారాలు యీకథంతా నాచేత అడ్డమైన వాళ్ళదగ్గిరా వాగించాలనుందా మీకు '

దమయంతి చేతులుమీద కూర్చొని కెల్లెలిముఖం లోని రోషానికి, అభిమానము వేమువ్వు తెరల్లో మునిగిపోయిన ఆమె ముఖబింబానికి, తన కర్తవ్యాన్ని కానపాగనివ్వకుండా ఆమె అనే అర్థం లేని మాటలకీ గొలుసు కట్టుకోలేక లంకెలందక చివరకిలా అనేసింది

'బావ వచ్చాక యీ సంగతి విని అయనే మంటాడో—అప్పుడు నీచేత ఒప్పించి నీ పత్యంతం తీసుకునే డాక్టరికి కబురు పంపుతా రంటావా అయన?'

విజయ ఒక్కమాటు వెనక్కి వాల్లబడ్డ దిండు కేబుకు ఎడమచేత్తో సర్దుకుంటూ—

'నీకు పుణ్యముంటుంది అక్కయ్యా జరిగిందేదో జరిగింది ఇప్పుడైనా నీవు ఎరక్కపోయి చెప్పావు బావకి సంగతి తెలియనివ్వొద్దు. అసలే నవ్వుతాలు పట్టిస్తాడు '

విజయ కేమీ పాలుపోలేదు ప్రపంచమంతా తన్ను కోళాకోళం పట్టిస్తూన్నట్లు యీ తప్పు ఒకరి చేతుల్లోంచి ఒకరికి అందరికీ అందుతూన్నట్లు అందరూ అదేపనిగా నవ్వుతూన్నట్లు తోచి 'అబ్బ!' అని కళ్లు గట్టిగా మూసుకుని ముఖం చిట్లించింది

దమయంతి లేచి 'రికార్డులు వచ్చే టయిము యింది పెట్టమంటావా విజయా?' అంది విజయ రేడియోకేసి చూసి 'పోనీ పెట్టు ' అనేసి యీజీచైరు లోంచి లేచి, తన గదివైపు కుంటుకుంటూ ఎల్లాగో నడిచి వెళ్లాలనుకుని గెంపెతుగులు వేసింది

అప్పుడే వరండాలోంచి కళ్లు నులుముకుంటూ హాల్లోకి వస్తూన్న ప్రసాదరావు 'అరే! ఇవ్వాళ విజయ ఎక్కడో బోర్లాకొట్టినట్లుందే? గెంతుకుందల యూరోపాయాల సైకిలు ఇటలీనుంచి తెప్పించాను స్పేరు పార్ట్సు కూడా యిక్కడ దొరకవు '

దమయంతి 'చాల్లెండి! మీరు యిప్పుడింకా దయచేశారు ఈవాళ దాని కంతగండం తప్పిందని '

'అందుకే ఆనందిస్తున్నాను '

విజయ చర్రున వెనక్కి తిరిగి,

'కాలుజారి పడేవాళ్లు పడుతూవుంటే నవ్వేవాళ్లు నవ్వుతూంటారు సంస్కారం లేని మనుష్యులు '

ప్రసాదరావు భ్రుకుటిచేసం విప్పుతూ—'ఈవేళ క్లబ్బులో అడ్డమైన గాడిదా నా ప్రక్కనుచేరి 'సారీ' అనేవాడే నేను గాదయ్యా పడింది మా మరదలు— నా కెందుకు కండోలెన్సని బ్రతిమాలుకుని యిక తల కొచ్చి ఎవేసరికి నా తలప్రాణం తోకవరకూ వచ్చిందంటే నమ్ము '

దమయంతి కళ్ళతో ముక్కుతో చేతుల్తో ఎన్ని విధాలుగా అభినయించి వారించాలో అన్ని విధాలుగా వారిస్తూ—

'మీకు పుణ్యముంటుంది అన్నారే దానికి ఊరుకుంత అభిమానం మీ రూరుకోండి వేళాకోళాలకి కూడా సమయాసమయా లున్నై '

విజయ తన గదిలోకి వచ్చి ఘణేలు మనేలా గదితలుపులు వేసి ప్రక్కమీద బోర్లా పడుకుని తల గడలో తలదూర్చి వెక్కివెక్కి ఏడవ నారంభించింది

'దూరాలా! నీ వనుకున్నంతపనీ జరిగింది' అంటూ దమయంతి కొరకొరా ప్రసాదరావుకేసి చూసింది.

ప్రసాదరావు రేడియో ట్యూను చేయబోతున్నాడు. దమయంతి శాస్త్రి నోరూ బాదుకుంటూ — 'మీరు యివ్వాళ ఏమి టిల్లాగ ప్రాణం తీసి పిండేస్తున్నారు! దాని కంట్లో ఏమీ బాగులేదు. ఆ లేడి దాని కొన్నెప్పు వాగించకండి'

ప్రసాదరావు ఆగి 'నేను సంస్కారంలేని మనిషినిగా మీ చెల్లెలు యింత క్రితమే చెప్పింది' దమయంతి 'ఆఁ' అని వెళ్ళి తువ్వాలు తెచ్చియిస్తూ 'స్నానానికి లేవండి. మీరు నేనూ భోంచేస్తే దానికి యిన్ని పోషకంబు తీసుకొన్నా కలిపియిస్తాను'

'ఓహ్హో! ఆ తరువాత మెషిన్లో వేసుకుని చిచ్చికూడా గొట్టకద్దూ నిద్రపసుతుందో పట్టవో అమ్మగారికి పోనీ ఆ పని నేను చేసిపెడతాను'

దమయంతి కోపంగా మూసి — 'మీ దగ్గర మంచితనంలేదు. ఆ మైకేలు యిటలీనుంచి తెప్పించాను. ఈవాళ క్లబ్బులో అంతా కండోలెన్స్ చెప్పారు ఎత్తుకుని చిచ్చిగొట్టు ఇట్లాంటి మాటలంటేక పోతే, ఆ ఎకిలి కీమూ పకపకలో కనుక్కోగలిగారు? దారికడ్డంపడి ఇకిలిగా నవ్వి ఆడపిల్లను చెదరగొడ్తాడూ యిదేనా చదువు? సంస్కారంలేని మనిషి?'

కళ్ళెర్ర కళ్ళు నీళ్ళు పాలాలుగా లోలుపు కంటూ 'కాస్త నీవుతోను మైడియర్ ఏమన్నావు? సంస్కారం లేదనా—వాడూ నాకు తమ్ముడిల్లేనే వున్నాడు క్రొత్తగొడ్డు మీ చెల్లెలి విసవిసలకు చెదిరిపోయి దారికడ్డం పడివుంటాడు'

ఓప్రమాదనుంచి చేతుల్ని తీసివేస్తూ పరుషంగా

'ఐతే మీ కేమీ కలగచేసుకోరన్నమాట— ఇవ్వాళ యిట్లా జరిగింది రేపు రెక్కలొచ్చాక లాగుతాడు మనమంతా చూస్తూ ఊరుకోవలసిందేనా?'

'కళ్ళుమూసుకుందాం. నేను చిన్నప్పుడు నువ్వు అటూయిటూ తిరుగుతూంటే రెక్కపుచ్చుకు లాగితే ఏం చేసేవాడివి? అంతే. ఏదో ప్రణయకలాపమనుకుని తృప్తిపడాలి.'

'ఛీ! ఛీ! ఛీ! రామ రామా మీ నోటికి శుద్ధి బద్ధం లేదు' అంటూ ఆ గదిలోంచి చరచరా వెళ్ళి పోయింది.

ప్రసాదరావు పట్టుపంచె చుట్టుకుని భోజనాల పావల్లోకి నడుస్తూ, విజయగదిదగ్గర ఆగి 'కొంచెం తలుపు తియ్యవే అమ్మాయీ! పెద్ద అద్దం యిలాగియ్యి —నేను రేపు కనుక్కుంటాను ఆ మహానుభావుడెవడో వాడికోసమని నువ్వు భోజనం మానుకోవడమేమిటి? యిలాగయితే యివ్వాళే కాతయ్యకు కబురుచేసేస్తాను'

లోపల 'విజయ' మాట్లాడకుండా ముఖాన్ని ఎర్రబర్చుకుంటోంది ప్రసాదరావు తలుపుసందులోంచి 'ఇదుగో నువ్వు వాడికోసం బెంగ పెట్టుకోవడం ఏమీ బాగా లేదు రేపు ఉదయం వాణ్ని తీసుకొచ్చి నీ ఎదుట పెడ్తాను నీ యిష్టం వచ్చినట్లు చేసుకో—తెలిసిందా యికరా వచ్చి అన్నం తిను

తలుపు ధళ్లున తెర్చుకుంది విజయ కస్సుమంటూ—

'ఏమిటి నువ్వనేది? ఆ కోతి కోసం నేను బెంగపెట్టుకుంటున్నానా నువ్వు వాణ్ని తెచ్చి రేపు ప్రొద్దున్న నాకప్పగిస్తావుకదూ అప్పగించవు మరి? ఇదుగో యీ అద్దం తీసుకుపో నన్ననవసరంగా యేడిపించకండి నాకు అన్నమూ అక్కర్లేదు అర్ధ్యాన్నమూ అక్కర్లేదు' ప్రసాదరావు విజయ అలిగిందని గ్రహించాక మెల్లగా ఉపక్రమించాడు

'ఇదుగో అమ్మాయ్ అనవసరంగా ఉద్రేకపడి లాభంలేదు వాణ్ని పది తిట్టి నిన్ను పది తిట్టుకుని కాలేజీ మానేసి గొడవ చేస్తే జరిగి పోయింది కలిసిరాదు నేను అన్నంత పనీ చేసి తీరతాను— నాకా సన్యాసి ఎవరో తెలవాలి మరి నేను వాణ్ని ఏ ఉపాయాన్నైనా వెంటపెట్టుకు రాగలను ఆపైన మీ అక్క యిష్టం నీ యిష్టం—వాడికి ఏ శిక్ష వేసినా మీ యిష్టం కాదనను సరేనా—'

విజయ ఉరుముల్లోంచి మెరుపుల్లోంచి దిగి చల్లబడి

'అతను పాపం క్రొత్త లెక్చరరు.'

ప్రసాదరావు 'వచ్చాడు. నువ్వే పొరపడుంటే కథ అద్దం తిరిగిచ్చెయ్. మా మాట వినుకుని ఏ పాపా

సం పెయ్యకోయిబా చివరకు గాడిదలయేది మగ వాళ్లే అవునా!'

విజయ అక్కడ్నుంచి చల్లగా వంటయింట్లోకి జారుకుంది బయటివరండా చీకట్లో నిలబడి పొంచి వింటూన్న దమయంతి—

'మీ రిక్కడ ఏమిటిచేస్తున్నారు?' అంటూ కెలికించింది ప్రసాదరావు 'వుండు డైలమాలో పడి కొట్టుకుంటున్నాను. వన్ టూ త్రీ ఈ రెండు క్రేళ్లా పట్టగో'

దమయంతి ఒకవ్రేలును చప్పున పట్టుకుంది ప్రసాదరావు చప్పున గంతి 'డామిట్! మీ చెల్లెలు నన్నే మోసం చేయాలనుకుంది'

'ఏమిటా మోసం?' అంది ఏమీపాలుపోక

'దీన్నే మొదటిచూపులో ప్రేమ-లవ్ అట్ ఫస్ట్ సైట్-అంటారు విజయ ఆ క్రొత్తలెక్చరరుట వాడ్ని ప్రేమిస్తోంది'

దమయంతి చప్పున నోరుమూస్తూ— 'మీకు మతిపోతున్నట్లే వుంది ఆ పాడు నవలలు చదవ కుండా వుండలేరు గదా' ప్రసాదరావు ఏమరు పాటుగా వున్న దమయంతి రెండు బుజాల్నీ గిరు క్కున తనవైపుకు త్రిప్పుకుని ముఖంలో ముఖం పెట్టి—'ఈ మీ ఆడవాళ్లు యిలాగేనా పైకి ద్వేషిస్తున్నట్లే వుంటారు లోలోపల ప్రేమ మరగకాగుతూంటుంది ఈ రోజుల్లో కాలేజీ అమ్మాయిల ప్రేమ కాఫీహోటళ్లలో పాలు లాంటిది దానికి మరగకాగటమే గాని పొంగి పొర్లటమంటూ వుండదు ఎందుకంటే గంటగంటకీ చెంచెడునీళ్లు కలుపుతూనే వుంటారుగా'

ఈసారి దమయంతి పొట్టచేత్తో పట్టుకుని నవ్వు నాపుకోలేక 'ఇంక మీరు మాట్లాడకండి చచ్చిపోతున్నాం యింట్లోవాళ్ళం మీ షర్ లాక్ హోంస్ మీరూను' అంటూ వంటయింట్లోకి వెళ్ళింది

ప్రసాదరావు పీటలమీద కూర్చునేసరికి రెండు కంచాలలోను పదార్థాలు వడ్డించబడివున్నై

లోపల దమయంతి విజయ చేతిలోని గరిటను లాక్కోవాలనే యత్నంలో విఫలురాలై వచ్చి ప్రసాదరావు ప్రక్కను చతికిలబడిపోయింది. ప్రసాదరావు 'ఈ మాష్టారెం! కబుర్లు ' ఇద్దరూ అన్నాలు కలిపారు విజయ మొదలకుండా వడ్డన చేస్తోంది ప్రసాదరావు పెదవు కదిపి ఒక్క అక్షరం ముక్క కూడా మాట్లాడలేదు. దమయంతి లేచాక చూస్తే వాన వెలిసిన ఎండ కాసిన సాయం త్రానికి మల్లే వుంది విజయ ముఖం.

## 4

క్రొత్త లెక్చరరు అహోబలరావుకు అన్నీ క్రొత్త సమస్యలే ఉదయం ఐదూ ఎనిమిదీ గంటల మధ్య ముక్కు ముఖం యేకమయ్యేలా పరవళ్ళపోతే ఎవరేమనుకొనిపోతారో అన్నట్లుగా కొట్టి కురిసింది వాన

హోటలుకు పోయి పెందరాళే రెండు మెతుకులు నోట్లో వేసుకుని క్లాసుకు తయారవుదామంటే వీల్లేకుండా టికట్ల పుస్తకం మాయమైంది పెద్దమైన దుస్తు లేసుకుని నీటుగా పోదామనుకుంటే నేలంతా ఎక్కడా అడుగుదీసేందు గట్టడానికి లక్ష్యం గాకుండా చిత్తడిలాడుతోంది పిన్నా పెద్దా, ఆడా మగా అంతా ఆ రొమ్మారోంపి దాటటంకోసం లాగుల్నీ ధోవతుల్నీ చీరకుచ్చెళ్ళను కొంత పైకెగబట్టుకొని ఎత్తిఎత్తి వేస్తున్నారు అంగలు

డాబామీంచి చూస్తూంటే, పెద్దమనుష్యులు కొంతమంది ఏ కూరలకనో మరోపనిమీదో బయలు దేరి వీధిలోకొచ్చి గొడుగుల్నెత్తి పట్టుకు నడుస్తూం డగా దారిలో ఎరికున్నవాళ్లెవరైనా ఎదురుపడితే 'ఆముదం' మ్రింగివలసిన వాడిలా ముఖం పెట్టి పలక రించినదాని కేదో జవాబులిచ్చి వొదుల్చుకొంటూ ముందుకు సాగుతున్నారు

అహోబలరావుకి వానకోటు కొనాలన్న విషయం అప్పుడే తట్టింది పర్సు తీసుకుని జేబులో వేసుకుని గబగబా మెట్లమీంచి దిగి వీధిలో కొచ్చి పడ్డాడు. ఆ తొందరలో అతను అడుచెప్పు లేసు కొచ్చాడు రోడ్డుమీద నడుద్దామంటే 'బంయ్' మంటూ అట్నుంచి ఒక బస్సు యిట్నుంచి ఒక బస్సు, పోనీ పేవుమెంటుమీద ఎల్లాగో సర్దుకుపోదా మంటే అక్కడక్కడ చెప్పులుకుట్టే వాళ్లు, గొడు గులకు ప్రాత కలాలకు టోపీలు పాలిసు అమ్మే, కళ్ల జోళ్లూ తాళంచెవులు మరమ్మతు చేసి తిరించే చిల్లర

వ్యాపారులు, చేసికొనకార్యాయ లమ్ముకునే ముసలమ్మలు, పిల్లలతో నానా అవస్తగానూ వుంది.

ఇక యీ పట్టణాల్లో ప్రతికటమే ఒక అవస్త. ఇట్లాటివాటిలో ఒకరి మనసులోకరు త్రొక్కుకుంటూ పరుగెత్తుతున్నారు జనం. పెట్టెబజారులోని ఫ్యాన్సీ గుడ్సు షాపులోకి అటు వైపునుంచి అహోబల రావు యిటువైపునుంచి ప్రసాదరావు ఒక్కసారే ప్రవేశించారు.

షాపులో జనం గొడుగుల్ని బేరమాడు తున్నారు. అక్కడకూడా నేల లేమగా ఉంది. తీరావాన కోటు కొందామనుకుని వచ్చిన అహోబల రావుకు గొడుగుల్ని చూడ్డంతోనే అదీ—యిదీ ఏది కొనటమనే త్రైలమాలో పడిపోయాడు.

ప్రసాదరావుని చూడగానే కొట్టు యజమాని 'దయచెయ్యండి సార్!' మాస్టారేరా వెనవా, పంతులుగారికి కుర్చీ వెయ్ కుర్చీ వెయ్' అంటూ జవాన్ని హెచ్చరించుకుని 'ఏమిటి యిలా దయ చేశారు? కాఫీ పుచ్చుకుంటారా? బోయ్ టిఫిన్ ఒక కప్పు కాఫీ పట్రా చప్పున' అంటూ అతి మర్యాద చేశాడు.

'కాఫీ ఏంటి? ఏమీ అక్కర్లేదు ఇప్పుడే పుచ్చుకొచ్చాను. నన్నవతవరంగా చంపకు' అన్నాడు ప్రసాదరావు. క్రొత్తరకపు ఫ్యాన్సీకళ్ళ జోడుతీసి విలాసంగా చేత్తో పుచ్చుకుని లెనిన్ బుష్‌కోటు వేసుకున్న ప్రసాదరావును, అతని జేబులోని పార్కరుపెన్ను, వెంటిక్స్ చైనుతో వున్న పదిహేండ్ క్రొత్తమోడలు వాటర్ ప్రూఫ్ రిస్ట్ వాచీని చూచిన అహోబలరావు వుండబట్టలేక ప్రక్కవాణ్ణి పొడిచి 'ఎవరీయన' అని అడిగాడు.

'ఎక్కడో పశ్చిమ గోదావరి జిల్లాలో పంచదార ఫ్యాక్టరీ కడ్తున్నారు. దానికి మేనేజింగ్ డైరక్టరు. ఇంకా మనవూళ్ళో చాలా కంపెనీల్లో ఆయనకు షేర్లున్నాయి' ఇది విన్నాక 'పశ్చిమ గోదావరిజిల్లాలో పంచదార ఫ్యాక్టరీ పెడుతూంటే యీ మేనేజింగ్ డైరక్టరు యీ వూళ్ళో ఎందుకు వుండటం' అనుకుని పోనీలే మన కెందుకని అకొట్టు యజమానిని 'ఖాటర్ కోట్లు' చూపించమని అడిగాడు.

అప్పటికి అహోబలరావుకు కాలేజీకి వెళ్ళటానికి గంటవ్యవధే వున్నది.

ప్రసాదరావు కాఫీ తీయిస్తూ 'చూడవోయ్ ఓవర్టేకు చెయ్యా ఒకటిన్నా, గర్వాక్షాకు పగిలిపోయింది అకోకటే యిత్వ!

'చిత్తం.' అని ఆసరుకుల్ని స్వయంగా తెచ్చి అందిస్తూ 'ఏం బాబూ యింట్లో అంతా కులాసా?' అన్నాడు కొట్టు యజమాని. ఈ ప్రశ్నకు ప్రసాద రావు సమాధానం నోటినుంచి పెగిలి బయటకురాక ముందే, సైకిలుషాపు డీలరు బంగారయ్య 'పంతులు గారూ లేడీ సైకిలు తీసుకున్నారు. ఇంకా కొరవ మిగిలిపోయింది కొంచెం యిబ్బందిలో వున్నాను లేకపోతే తమ పోటీవారి దగ్గర సొమ్ము ఖజానాలో వున్నట్టే' అంటూ లోపలికొచ్చాడు యితడిరాక పనిగట్టి.

అవతల కొట్లో చిన్నచిన్న జేరాలన్నీ సర్దుతూ చూసుకుంటున్నాడు. ప్రసాదరావు కొంచెం విచారంగా 'ఆ సైకిలు తుక్కు తుక్కు యిందోయ్ కుర్రాడ్ని పంపించు యిచ్చేస్తాను మళ్లీ అమ్మేసి వొచ్చినడబ్బు నాకిచ్చేద్దుగాని' అన్నాడు. కళ్లు తేల్చి పైకి చూస్తూ బంగారయ్య 'ఏమిటి అలా అంటున్నారు ఏం జరిగింది?' అంటూ కుతూహలంగా ప్రశ్నించాడు. ప్రసాద రావు కొంచెం దుఃఖంగా 'అది కొన్నవేళా విశేషం మంచిది కాదోయ్ నిన్న మా మరదలు దాని మీంచి పడిపోయింది. యాక్సిడెంట్ సీరియస్ కాదు గాని దెబ్బలు తగిలాయి'

అహోబలరావు గుండె చప్పున ఆగిపోయింది. చచ్చాంరా యిక్కడె కొచ్చిపడ్డాను. ఆ క్రొత్త సైకిల్ని నేనే అని తెలిస్తే యీ మేనేజింగ్ డైరక్టరు నాముఖం చెక్కేస్తాడు గావల్ను. ఎట్లా యిక్కడనుంచి తప్పించుకోవడమనే భయంతో గబగబా బిల్లు చెల్లించి వీధిని పడ్డాడు. అతని కళ్లు చీకట్లు కమ్మాయ్. పట్టుకోండి 'పట్టుకోండి! అని ఎవరో అరుస్తూ వెంబడిస్తున్నట్లు తోచింది.

## 5

గోదావరి స్టేషన్లోకి రైలు వచ్చి ఆగీ ఆగటం సుందరరామయ్య బోషాణంలాటి పెట్టెను కూలీం

సహాయంతో కిటకిటలాడ్తూ కిక్కిరిసివున్న ఆడవాళ్ల పెట్టెలోకి ఎల్లాగో కొట్టి ముఖంమీది చెమటను తుడుచుకుంటూ—'ఎక్కమ్మా యిది ఆడవాళ్ల పెట్టె ఎల్లాగో రెండు గంటలసేపు కళ్లు మూసుకున్నావా బెజవాడ స్టేషను వొస్తుంది' అని సామాన్లో నింపిన గోనుసంచిని ఎక్కడ వుంచటమా అన్న ఆలోచనతో పెట్టెలోకి తొంగిచూశాడు

అలివేలు క్రొత్తచీర కట్టుకుంది కాళ్లకు రాసుకున్న పసుపూ స్టేషనుకు వచ్చే ఆదరా బాదరా తొందరలో వాళ్ల అమ్మ ముఖాన పెట్టిన కుంకుమా చేతిలోని బలిమిడీ పసుపుకొమ్ముల సంచీలో లోపలికి ఎక్కబోతూ చేయి పట్టుకునే వుండటం వలన రెండు గాజులు చిట్లాయి లోపల ఎవరో స్త్రీ సానుభూతిగా 'అయ్యో! చిట్లేయమ్మా గాజులు చిట్లాయే—' అంటూ పక్కకుని చోటిచ్చి గుమ్మని కష్టంగా వేయిస్తూన్న సామానుసంచిని విమర్శిస్తూ 'దారి కష్టమయ్యా—ఎక్కేవాళ్లకూ దిగేవాళ్లకూ ఎల్లాగ?' అని గొణిగి 'యిల్లెమ్మా మీ పుట్టిల్లు ఏ వూరు' అంది అదే వరసని అలివేలు ఆవిడ దయార్ద్రతకి కృతజ్ఞతగా 'ఈ వూరేనండీ' అని 'నాన్నా ఆ సామాను లోపల సర్దితే దారి కష్టం లేకుండా పాపం ఎక్కేవాళ్లకూ దిగేవాళ్లకూ' అని అనటం ఆ స్త్రీ మర్యాదగా 'ఫరవాలేదమ్మా ఆ సామాను సీదా అత్తగింటికి కాబోలు వస్తున్నావు ఆయన మీ నాన్నగారా' అంది 'అవునండీ' అని అలివేలు కిటికీలోంచి తండ్రికేసి చూసింది సుందరరామయ్య లోపలికొచ్చి సామాన్ని దారి కష్టం లేకుండా సర్ది—'మర్చిపోయాను యిదిగో టిక్కెట్టు జాగ్రత్తమ్మా అతను స్టేషనుకు వస్తాడు ఇప్పుడే టెలిగ్రాము యిస్తాను అమ్మా కొత్త మా అమ్మాయి బెజవాడ స్టేషన్లో దిగుతుంది. చూస్తూండండి' అని ఆ స్త్రీకి అప్పగించాడు

రైలు కదిలింది అలివేలు పెట్టెలోంచి ఆకాశంవైపు మరోకసారి తండ్రి వైపు చూసింది ఆకాశం స్వచ్ఛంగావుంది ఎక్కడా మబ్బులు లేవు ఎండ బంగారంలా వుంది తండ్రిముఖం దమ్మిడీ కొంత యింది తండ్రి చెంగుతో కళ్లు తుడుచుకుంటూ 'వుంటానమ్మా' అంటున్నాడు అలివేలు తెల్లబోతూ తలను పెట్టెలోకి లాక్కుంది. పెట్టెలో ముందుకుని ఒక బత్తాయితొనను కోసంగా కొరికి తొడ క్రొక్కిడిగావున్నది రైలు గోదావరిని దాటుతోంది. గోదావరిని చూడ్డంకోసం దంతాకకేలాటి మనిషి అలివేలుమీదనుంచి త్రోసుకుంటూ కిటికీలోకి మెడను దూర్చాలని ప్రయత్నిస్తోంది ఆవిడ కూర్చున్నచోటు ఒక చదరపు గజం మేర అందులో చుట్టూ అరడజను బత్తాయికాయల తొక్కలు నోర్చి పారబోసింది జనాక్కాల పల్చటి దిండు ఆనుకుందుకు వేసుకుంది ప్రక్కనే ఒక యింగ్లీషు పత్రిక రెండుమూడు కథల పుస్తకాలువున్నా మీద కొక్కికి [illegible] వేలాడుతోంది బహుశా ఆ కథలు చదువుతూ మధ్య మధ్య ఆవిడ అంతుగోని పానీయాన్ని కొద్ది కొద్దిగా ఆరగిస్తూ వుండాలి అలివేలు కావిడిధోరణి నచ్చలేదు పెట్టెలో యింకా రకరకాల ఆడవాళ్లు నిల్చునే పిల్లల్ని ఎల్లాగో వూరడించుకొంటున్నారు ఆవిడ ఎక్కడ తన సుఖం చూసుకునే మనిషిగా కనుపించింది అట్లాటి వళ్లంటే అలివేలుకు కష్టం కోపం పైగా వచ్చి ఆవిడ తన వస్తువుల గోప్పని తనమీదుగా పోనిచ్చి గోదావరిని చూసి ఆనందిస్తోందంటే చిరాకువేసినమాట మాత్రం నిజం

రైలు కదా కదా మంటోంది వంతెనమీద అలివేలుకి తలనొప్పి ఆవిడ వక్షప్రదేశం అలివేలు ముఖానికి రాసుకుంటూ ఉక్కిరి బిక్కిరి చేయటం వలన 'ఊపిరాడ్డం లేదండీ' అంది విసుగ్గా కంఠలు తిరిగి ముఖతను పడ్డ ఆమె మెడను అలివేలుకేసి త్రిప్పుతూ 'ఇప్పుడెవగా ఎక్కావు ఈ మాత్రానికే యింత చిరాకా—నేను ఎక్కడ్నుంచి వస్తున్నానో తెలుసునా నిన్ననగా ఎక్కాను'

'అదంతా అనవసరమండీ మీరు ఎప్పుడెక్కితేనా కెందుకు? నాకు ఊపిరాడ్డం లేదంటున్నాను దయచేసి మీ సీట్లో కెళ్లి కూర్చోండి' అని ముఖం కందుకు చేసింది.

ఇంతవరకూ ఆవిడ నిన్నటినుంచీ ఆ పెట్టెలో ఏక ఛత్రాధిపత్యంగా పరిపాలన సాగిస్తోంది కాని యిటువంటి అవమానం జరగలేదు అదీగాక అలివేలు చాలా పసుపుంగా అన్నమీదట ఆవిడ మొదలకంటా సీట్లో కెళ్లి తన చదరపుగజం చేరుతూ తిరిగి అక్ర

జోల్లో వేసుకుని గింజల్ని కుప్పకు కుప్పగ పోస్తూ కథల పుస్తకం తీసి ముఖాని కడ్డంగా లాక్కుని కోర చూపులు చూడసాగింది

కొవ్వూరు స్టేషను వొచ్చింది. అక్కడ కో పచ్చి బాలెంతరాలు రెండు నెలల గుడ్డును తీసుకుని ఆ పెట్లోకే ఎక్కింది ఎక్కడా చోటు లేదు ఈ దంతావళం చక్కగా భాసింపట్టు వేసుకు కూర్చొ న్నది ప్రక్కనే ఒక మనిషి కూర్చునే చోటులో పత్రికలు పుస్తకాలూ పర్చింది ఎవరూ ఆమెను ఆ చోటు ఖాళీ చెయ్యమని అనరు ఆ పచ్చి బాలెంత రాలుకు నోరు లేదు అట్లానే నిలబడింది ఆ పరి స్థితిలో ఆవిడ ఉక్కుకష్టంగా నుంచోవటం యీ దంతావళం చూసింది చూసినా చలించలేదు మళ్ళీ అలివేలు కలుగ చేసుకోవాల్సి వచ్చింది

'ఇదుగో ఏమండోయ్ మిమ్మల్నే ' ఆవిడ ఉలుకు లేదు పలుకు లేదు తిన్ను కానట్లు పూరుకొంది

'ఆ పుస్తకాలు కొంచెం తియ్యండి అక్కడ కాస్త చోటుంది ' అంది మళ్ళీ అలివేలు ఈమారు ఒకమాటు తలెత్తి చూసి మళ్ళీ నిర్లక్ష్యంగా పుస్తకం చదువుటో వారంభించింది అలివేలు లేచి ఆ బాలెంతరాలు చెయ్యి పుచ్చుకుని లోపలికంటా నడిపించుకొచ్చి ఆ పుస్తకాలను చేత్తో తీసింది ఆ దంతావళం 'అవి అక్కడ పెట్టు ముందర ' అంటూ గర్జించింది అలివేలు ఆ బాలెంతరాలు చేతిలోని పసిగుడ్డు నందుకుంటూ 'మీ రిక్కడ కూర్చో' మని ఆ పిల్లతల్లిని ఆజ్ఞాపించింది 'కూర్చోటానికి వీల్లేదు ' అంటూ దంతావళం చేత్తో ఆ తల్లిని నెట్టి వేయటానికి సాహసించింది అలి వేలు కళ్ళ వెంట నిప్పులు కురిపిస్తూ 'ఇదుగో బాగా చూడండి మీరు కనుక ఆమెను కూర్చోనియ్యక పోతే యీ చేతిలోని పుస్తకాలను కట్టగా కిటికీ లోంచి అవతలకు గిరాటు వేస్తాను 'అని చేత్తో పుస్తకాల దొంతరను ఝళిపించింది పెట్టెలోని తతిమ్మా ఆసవాళ్లు గొల్లుమన్నారు. ఆ ముక్కలన్న తరువాత అలివేలు అంతపనీ చేసేదాని లాగునే వుంది. ఆవిడ దర్పంగ నోరు తెరచి పెట్టెలో అందరి కంకా చూస్తూ— 'నేను ఎవ్వరికైనా భయపడ్డానా ఎక్కడున్నుంచి వస్తున్నానో తెలుసా !?' అంది. అంతా మళ్ళీ గొల్లుమన్నారు. ఈమారు అలి వేలు కూడా నవ్వింది బాలెంతరాలు చేతిలోని పాపాయి కూడా నవ్వింది. ఈమారూ దరాజయందంతావళా నికే ఆ బాలెంతరాలు కూర్చుని ఓపిగ్గా చంటిపిల్లకు పాలు కుడుపుతూ 'పదికాలాలపాటు చిరి చంత శ్రీ కలిగి పసుపూ కుంకుమా పెట్టుకుని బతుకు తల్లీ !' అంటూ దీవించింది

దంతావళం పూరుకోలేదు. నసుగుడు ఆరంభిం చింది 'పారేస్తుందిట' పుస్తకాలు పారేస్తే పోలీ సులకి కబురు చేసేదాన్ని ' అంది పెట్టెలో ఒక మూలనుంచి ఒక తూర్పారిప చుట్టనోట్లోంచి తీసి— బాలింతరాలు కూర్చోటానికి చోటెట్టమని ఆ మాతల్లి అడిగితే పెద్ద నా పరాయిలా ఒల్ల సంగా నికి తాటించుకుని, నెగమంటే పిలుస్తాదిట పోలీ సుల్ని, ఎదవపుత్తకాలు ఎన్ని సదిగితేం ఆమాతల్లి కున్న గ్యానం లేదు చీరాము చీరాము కలికాలం' ఈలోగా గుడ్డిబిచ్చగాడు రైల్లో కెక్కి—

'నిజము కల్లవుతుంది కల్ల నిజమవుతుంది.
నిజము నిలకడమీద తెలవాలి బ్రహ్మనో—

భజగోవింద ! గోవింద !' అంటూ పాట లంకించుకున్నాడు దంతావళానికి ఓపిక చచ్చి 'బ్రూట్స్'అనేసి ప్లాస్కులోని కాఫీ గిద్దెడు పోసుకుని చప్పరిస్తూ కథల పుస్తకం పేజీలు తిర్చి, బలవంతాన చదవటం నటించ సాగింది లోపంతో. కాజీపల్లిగూడెం స్టేషన్లో యీ దంతావళానికి మరోక పరాభవం ప్రాప్తించింది అలివేలు వాళ్ళ సంభాషణలనుంచి తెలుసుకున్న దేమిటంటే 'యీవిడ అల్లుడుగా రింటికి బెజవాడ వెళ్తోన్న దన్నీ—అక్కడ తన చిన్నకూతురు కాలేజీలో చదువుకొంటున్న దనీ—ఆ అల్లుడు పంచదార ఫ్యాక్టరీ మానేజింగ్ డైరక్టరుట ఈ సంగతులు ఆవిడ చెప్పటంలో ఎంతో దర్పం, గొప్పతనం, అనుభ విస్తూ చెప్పింది

కొంతసేపు యీ దంతావళమూ ఆ పరాభవమూ యింగ్లీషులో అలివేలుకేసి కొరకొర చూస్తూ ఏదో మాట్లాడుకున్నారు. తరువాత బెజవాడ స్టేషనొచ్చే వరకూ అలివేలుకు యీ రెండు జంతువులే కాం క్షేమం.

బెజవాడస్టేషను వస్తున్నదనగానే దొంగిలాళ్ల ఉత్సాహంలో అలివేలు ప్లాటుఫారంకేసి చూస్తూ

ల్లోకి పరీక్షగా ఆదుర్దాగా చూడసాగింది దూరాన్ని రంగురంగుల లైట్లతో స్టేషనంతా దీపాల్తో జగజ్జేగీయ మానంగా వుంది

ఆ దంతావళం అలివేలు పెట్టెను కొంచెం అడ్డంగా వున్నదనే నెపంమీద 'శాల్తీ కష్టం వెనక పెట్టి!' అని కసిదీర తిట్టింది. అలివేలు వూరుకో లేగు 'పెట్టెపెట్టె గిన్నెపెట్టె అనబోకు పోలీసుల్ని పిలుస్తాను' అంది మళ్ళీ అంతా గొల్లుమని నవ్వారు రైలు ఆగింది అహోబలరావు కిటికీదగ్గర్నుంచి అలివేలు భుజంమీద తట్టాడు ఉలిక్కిపడి 'మీరా ' అంది 'వచ్చావా—' అన్నారు కళ్లు మిలమిలా మెరుస్తూండగా యింత చేసుకున్న ముఖంతో 'వచ్చాను' అంది అలివేలు

ఆ దంతావళంకోసం వచ్చిన విజయ, తల్లిని ముందు పలకరించకుండా 'బావా! బావా! ఆయనే మా క్రొత్త లెక్చరరు' అని ప్రసాదరావుకు అహోబలరావును చూపెట్టింది

## 6

చెల కష్టంబని పొలాల్లోంచి రెండెడ్లబండిని క్రోలుకొల్లినట్లుగా దంచుకున్నాడు ఉపన్యాసం అహోబలరావు విషయం సత్యాగ్రహింపలు — గాంధీ, గౌతమ బుద్ధుడు పాఠం ఆకట్టలేనివాళ్లు బందరు లైనుమీద బల్లిలా పాకుతూన్న గూడ్సు రైలు పెట్టెలను లెక్కపెట్టుకున్నారు ఉపన్యాసం డొంక తిరుగుడుగా వుంది అవసరమైన విషయాల్లోంచి అనవసరమైన విషయాల్లోకి దాంట్లోంచి దీంట్లోకి దీంట్లోంచి దాంట్లోకి కప్పదాట్లు కుప్పిగంతులు వేస్తున్నది వినా యేదో సమర్థతతోనే చెప్పుకుపోతున్నాడు. కొందరు కుర్రవాళ్లు కబుర్లు ప్రారంభించారు. కొంతమంది మెల్ల మెల్లగా గోడవారల్నుంచి జారుకొంటున్నారు. ఇంకా మరికొందరు ఉంగుంగ్ని 'చుట్టా బీడీ సిగరెట్'—'చా! చా! గరం చా' అని కేకలేస్తున్నారు అహోబలరావు దవ్వున నీర సించి యిట్లా గన్నాడు—'మీ కెవరికీ విషయం పట్ల ఆసక్తి వున్నట్లు కనుపట్టంలేదు. వినా చదువుకో టానికి వచ్చినట్లు లేరే ' అని. వెనుక బెంచీలోంచి 'చాలా చక్కగా గ్రహించారు.' అని — యింకొక మూలనుం 'బాగుకాస్తు' అని. వేరొకచోటనుంచి 'ఈవాళ్టికి చాల్లెండి మాస్టారూ!' అని పలవోలు సంగీ తాలు ఆదేశాలు వచ్చినై అడపిల్లలు నవ్వుతున్నారు వాళ్లు ఎందుకు నవ్వుతారో వాళ్లకే తెలియదు అహోబలరావు కుర్చీ పట్టుపలకొద్దీ ఉపన్యాసాని కందుకున్నాడు తరుణం విషయం 'ప్రపంచ శాంతి'తో ముడిపెట్టబడింది. ఆర్థికశాస్త్రానికి సంబం ధించిన, రాజకీయాలకు సంబంధించిన ప్రశ్నలు లేచి తలొక్కరూ వేయసాగారు చివరకా క్లాసు పర సరాం ఫైన్ సర్కస్‌గా మారింది అహోబలరావు కుర్చీ వదిలి బెంచీల మధ్యకొచ్చి గర్జించాడు 'మీరు గొడవ మానుతారా లేదా?' అంటూ ఒకటికి రెండు సార్లు పొలోమంటూ అంతా లేచి 'క్రొత్త మాష్టారికి జై! క్రొత్త మాష్టారికీ జై!' అంటూ యువతిల కొచ్చి పడ్డారు

భిన్నవదనుడై అహోబలరావు యువతులకు రాగటం చెట్ల దగ్గర బయాలజీహాల్లో జూ ఆలజీ ప్రాక్టికల్ చేస్తున్న విజయ చూసింది చూసి ప్రక్కనున్న స్నేహితుల చెవిలో ఏదో చెప్పింది అంతా అహోబలరావు సమీపాన్నుంచి పోతుండ టాన్ని కనిపెట్టి పకపకా నవ్వారు హాలు హాలంతా పక పకలతో ధ్వనించింది అహోబలరావు కోపంగా విజయకేసి చూశాడు విజయ కటువైన మంచి హాసాన్ని విసిరింది

'చాల్లేవే—ఏమిటా విసురుడు!' అంటూ వచ్చింది ఒకతె.

'అది కాదే—క్రొత్తవాళ్ళనంత బెదరగొట్టా లేమే విజయా!' అంది మరొకతె అంతా నవ్వారు.

బల్లమీది చెక్కకు వాలుగువై వ్రేలా డేకులు దిగగొట్టి వెల్లకిలా పడుకోపెట్టబడిన కప్పకు రక్త ప్రసార మెట్లా జరుగుతుందో చెప్పి, గుండె చలనం గూర్చి చెబుతున్నాడు విజయ పరధ్యానంగావుంది సన్నటి చాకులు చిన్న చిన్న సూదులు పెట్టెలోంచి తీసి తుడుస్తూ 'చూసే యుందిరా' అని పిలిచింది ఇందిర నోట్సు వ్రాయటం ఆపు చేసి 'ఏమిటే అంత అర్జంటు?' అంటూ వచ్చింది.

'కలీన్ కల్చరల్ అసోసియేషన్ ప్రారంభో త్సవం ఎప్పుడే?' అంది విజయ

'అదిశ్యం యిప్పుడెందుకే?' అంది ఇందిర.

'పదుందన్లే చెప్పు. ఎప్పుడు ప్రారంభించటం?' మళ్లీ రెట్టించింది

'ప్రిన్సిపాల్నడిగాకే. ఇవ్వాళేమధ్యాహ్నం పోయి అడుగుదామా?'—విజయ ఆలోచించి 'సెక్రటరీని పిలక్కే' అంది. సెక్రటరీవచ్చి 'ఎందుకే విజయా అవతల టేబిల్ దగ్గర సగం సగం ప్రాక్టికలు చేస్తూవచ్చావు చెప్పు'

'మన అసోసియేషన్ 'డే' ఎప్పుడు చేద్దామే' అంది విజయ 'ఇప్పుడెందుకే ఆ చర్చ?' అంది సెక్రటరీ

'ఆఫీసు బేరర్ గా నేను ప్రొత్త లెక్చరర్ను సూచిస్తాను మీరంతా వోట్లేయ్యాలి'

'ఎందుకే—పాపం ఆతన్ని యేడిపించటం?' అంది ఇందిర సెక్రటరీ అందుకుంది 'పాపం అంటూ వెనకేసుకొస్తోంది దీనికేమన్నా చేవ త్తోడుకేమోనే వాడు.'

విజయ 'అల్లానే వుంది కాకపోతే యేమిటి?' అంది పేళవగా ఇందిర కోపంగా—'ఆ దగ్గర వరసలన్నీ ఐతే మీకవాలి? నాకేం— నేను నా వోటు వెయ్యను'

'మడిచిరల్లో పెట్టుకో' అంది సెక్రటరీ ఇందిరకు కోపమొచ్చి లేచి బల్లదగ్గరకు వెళ్లి ప్రాక్టికలు చేస్తోంది విజయచాకులు మాదులతో బల్లమీద కప్పును పైపైన కోస్తూ సెక్రటరీ చెవులో ఏమేమో చెప్పి నూరిపోస్తోంది ఇద్దరూ ముసిముసిగా నవ్వుకుంటున్నారు విజయకు ప్రాక్టికల్ మీద దృష్టిలేదు సెక్రటరీ బల్లమీదకువంగి విజయ ముఖంలోకి చూస్తూ మాట్లాడుతోంది ఈలోగా సగంసగం కోసివిలోకి వస్తూన్న కప్పపోయే ప్రాణంకోసం పెనుగులాడుతూ నాలుగుకాళ్లను కుంచించి తిరుగుబాటు చేసింది క్లోరోఫారం పట్టుతప్పి కప్ప నాలుగుమేకుల్ని ఎగర తన్ని సెక్రటరీ ముఖానికొచ్చి గుద్దుకుంది.

'అమ్మ బాబోయ్' అని సెక్రటరీ భయంతో కెవ్వుమని కేకేసి చటుక్కున పరుగెత్తింది విజయ తెల్లబోయి చూస్తూ నిలబడిపోయింది నాలుగువైపుల్నుంచి విద్యార్థులు అధ్యాపకులు, అటెండర్లు ఏమిటి ఏమిటి అంటూ పరుగెత్తుకొచ్చారు.

భయపడిపోయిన సెక్రటరీ యేడుపు లంకించుకుంది అధ్యాపకుడు అటెండర్ని కేకలేస్తే అతడు 'పొరపాటు క్షమించాలి క్లోరోఫారం సరిగా యివ్వలేదు కాబోలు' అని నసిగాడు విజయ సెక్రటరీని నడిపించుకుని వైటింగురూంలోని కెళ్ళిపోతూంటే అందరూ యీ అమ్మాయి ముఖంనిండా బట్టలనిండా యీ నెత్తురేమిటి మరకలేమిటని అడిగేవాళ్లే? అడిగి తెలుసుకున్నాక పొట్ట చెక్కలయ్యేలా నవ్వేవాళ్లే? ఇందిర ఆ కాలంకోసం కాచుకు కూర్చున్నది విజయ, సెక్రటరీ, బట్టల్లో ఎక్కుతూండగా 'ఏమే – యిలా గలేపలా 'డే' ఎల్లాగుందేం?' అంది సెక్రటరీ ముఖమంతా వలుపు చేసుకుంది విజయ 'ఇప్పుడా, యిదా వేళాకోళానికి సమయం' అన్నట్లు చూసింది

ఇందిర మాటలో మాట కలిపింది—'జరిగిందేదో జరిగింది కాని – యింకెప్పుడూ అనవసరంగా మనకు సంబంధంలేని విషయాల్లోకి దిగి యితరుల్ని అవమానించటానికి ప్రయత్నాలు పన్నకండి' దీంతో సెక్రటరీ దబ్బిపోయింది విజయ వుసుకుమోతుతనంగానే అంది—'నీకు మహ బాగా తెల్సులేవే—అందర్నీ వెనకేసుకొచ్చి మాట్లాడుతున్నావ్ ఇవాళ ఏదో ఆ వెధవ క్లోరోఫారం సరిగ్గా యివ్వనందుకు ఆ కప్పకు తెలివొచ్చి మేకుల్ని ఎగరగొట్టిందని దానికి దీనికి ముడిపెడుతున్నావు వాడెంత రోగ్గో నీకు తెల్సా—నిన్న సైకిలుమీదనుంచి పడేశాను నిన్ననే అమ్మ కలకత్తా నుంచి వస్తూంటే రాజమండ్రిలో ఎక్కిందట – యీయనగారి భార్యామణి మాట్లాడుతుంటే నీ మాటా మళ్లె కిటికీలోంచి గోదావరిలో పారేస్తానని బెదిరించిందట ఇద్దరికిద్దరే పీడిపీడి పెళ్లానికి యిద్దరికీ బుద్ధి చెప్పాలి' అని

సెక్రటరీ మళ్ళీ అంది—'ఒసే ఇందిరా— నీ వనవసరంగా దీంట్లో జోక్యం కలుగజేసుకోకు వాళ్లిద్దరికీ బుద్ధి చెప్పందే మేం నిద్రపోయేది లేదనుకో'

ఇందిర మళ్ళీ కప్ప సంగతి గుర్తుకు తెచ్చుకుని పకపకా నవ్వుతూ 'నా కెందుకు జోక్యం—నేను కలగజేసుకుంటే ఆ కప్ప ఎగిరి నామీదే పడివుండేదియుండాక' అంది. ఇంతలో సిటీబస్సు వచ్చింది ఇందిర బస్సులోకి ఎక్కింది 'ఇవేమిటే యింత చెత

నరంగా చెప్పి తింటానికి కూడా లేకుండా మాట్లాడుతుంటే' అంది కత్రటకి. చెక్కా కోలు 'ఛళ్'మంది. కొయ్య పోరకా 'బంయ్' మంది

## 7

రోజులు గడుస్తూన్న కొద్దీ చిత్రవిచిత్రమైన సంఘటనలు జరుగుతూవచ్చాయి ప్రపంచంలోని ఒకరకపు అసందర్భపు మనుష్యుల్లో ఒకడైన అహోబలరావు 'భాగ్యజీవితం' దినదిన గండం, నెయ్యేళ్లాయుష్షుగా మారిపోయింది ఉపన్యాసపాటవ్యటం మొదట్లో క్రొత్త అనిపించినా క్రమంగా కొన్నాళ్ళకు మామూలై పోతుంది అందరికీ ఇతడి విషయంలో అట్లా కాలేదు చిన్న చిన్న అడ్డంకులు సంఘటనలు వచ్చి వ్యక్తిని నిరుత్సాహపరిచాయి. తరువాత స్నానంటే భయం దడ ఎక్కువవుతూ వచ్చింది కాని తగ్గలేదు చక్కగా కష్టపడి అవీ ఇవీ చదివి మరీ వెళ్ళేవాడు—కాని నోరు విప్ప నివ్వక! ఖర్మ!

ఇంటి కొచ్చాక పెద్ద పెట్టున రాగా లెట్టా లనిపించేది అతనికి ఎవరితో మాట్లాడకుండా దిగాలు పడి కూర్చుండి పోయేవాడు అర్ధరాత్రి నిద్రలోంచి ఉలిక్కిపడి లేచి 'భయం' అనేవాడు 'నా చేయి మీమీద వేస్తాను మీరు సుఖంగా నిద్రపోండి మీ కెందుకు భయం' అనేది అలివేలు

ఒక రోజున గదిలో కూర్చుని కొంపాటవను పుస్తకాలు సంస్కరించటానికి బదులుగా రెండు చేతుల్తో తలగట్టిగా పట్టుకుని వెక్కి వెక్కి యేడవటాని కారంభించాడు అలివేలు వంటయింట్లో కాఫీ కాచటంలో మున్నరాలైవుంది

'మరో పది నిముషాలకు కాఫీ కప్పు బల్లమీద వుంచుతూ—'కళ్లు ఎర్రగావున్నా యేమండీ?' అంది చకిత వదనయై అహోబలరావు ఉత్తరీయంతో కళ్లద్దుకుంటూ 'ఏమీ లేదు' అని కాఫీ కప్పందుకుని రెండు గుక్కలు పీల్చి ముఖాన్ని ప్రక్కకు త్రిప్పి కిటికీలోంచి ప్రొద్దుగ్రుంకటాన్ని తిలకించ సాగాడు. పడక కుర్చీ వెనుక్కువచ్చి నిల్చుని 'నామీద వొట్టే. ఏమీ లేదూ?' అంది గారాయిస్తూ అలివేలు.

ప్రక్క వాటాలో వాళ్ళమ్మాయి యేడ్చి గోరాం చేస్తూంటే—'ఉల్లాల్లా హాయీ! యేడవకు యేడవకు వెర్రి నాగమ్మా! యేడిస్తే నిన్నెవరు యెత్తుకుంటారు?' అని తల్లి వోదారుస్తోంది అలివేలు కాస్సేపు నిశ్శబ్దంగా నిల్చుని 'దీపం వెలిగించుకొస్తాను. అలక చెందకుగాని లెండి అన్నం పెడతాను' అని గిరుక్కున వంటయింట్లోకి వెళ్లింది

అహోబలరావుకు నెమ్మదిగా సంగతులు ఎంత వద్దనుకున్నా జ్ఞాపకానికి రాసాగినై అలివేలు తన్ను యేరికోరి వలచి చేసుకుంది పెంపుడు చేరదీసి కళ్లు—పిల్లా అహోబలరావు కివ్వడ మేమిటి అన్నారంతా. అసలయితే చదువుకున్నాడు గాని, ఎక్కడా ప్రాపంచికజ్ఞానం, తెలివితేటా, అందం, మనిషిలో నాజూకు గాని లేవు. కాకి ముక్కుకి దొండపండు కట్టినట్లు ఏమిటిది? అంటే అలివేలు సమాధానమిచ్చింది 'నాకు అందం అక్కర్లేదు ఎక్కువన్నా అందాన్ని కొరుక్కు తింటామా? అది యివ్వాళ వుంటుంది రేపు పోతుంది ఈవాళ నలకూబరునిలాంటి వాడ్ని తెచ్చి కడతారు రేపు ప్రొద్దున్న వాడికే మశూచికమన్నా రావచ్చు అప్పుడా అందమంతా పోతే - అటువంటి అందాన్ని చూసి పెళ్లి చేసుకున్నా నాగతేం కాను?' అంది పెళ్లికూతురు

ఇది మాటలు నేర్చిన కుక్క యిపొక్క మంటే యిపొక్క మంటుంది అన్నారంతా తల్లి అడిగిందట—'ఆస్తి మాటో—లక్షణమైన బంగారపు బొమ్మలాటి పిల్లనిస్తే, తిండి బట్టా యిచ్చి సుఖపెట్టే చోటు అవునో కాదో కాస్త చూసుకో నక్కర్లేదుటే.' అని అప్పుడు కూడా అలివేలు కొంటె మాటలు మానలేదు

'డబ్బు కూడా అట్లాంటిదేగా అమ్మా. అది యివ్వాళ వుంటుంది రేపు పోతుంది రోజూ మనం ఎంతమందిని చూడ్డంలేదు లక్షాధికారులు భిక్షాధికారులు కావటంలే—'

తల్లికి అత్తరువులో కారం వేసి రాచినట్లైంది దాన్తో ఆవిడ చిరాకుపడింది-'ఈ అడ్డదిడ్డం మాటలన్నీ చెబుతున్నదానిని ముష్టి నిజానికి మొగుడితోటి కాపురం చేసేదానికేనా?' అని

అహోబలరావు అనుకున్నాడు—యిటువంటి బంధం వుండేచోట అన్ని ముక్కా త్రెంపుకుంటా

మన్నా రెగత్రు. లేనిపోట ఎంత అతుక్కుండామని భగీరథప్రయత్నం చేసినా అతకదు ఆ ఆశలు గగన కుసుమాలుగానే వుంటాయి. ఎవరి చేతిమెతుకులు ఎవరికి ప్రాప్తో, ఏపిట్ట యేపిట్టతో కలిసి గూడు కట్టుంటో చెప్పటానికి నిజంగా యెవరికి తెలుసు?

ఎలిమెంటరీ స్కూల్లో చేరినప్పట్నుంచి ఆనర్సు క్లాసు పూర్తయేవరకూ యీ పదిపదిహేనేళ్ల లోనూ ఒకే ఒక రకపు మనస్తత్వాన్ని పెంపొందించుకున్నాడు అహోబలరావు జీవితం పొడుగునా అపహాస్యాలకు, స్నేహితుల ధిక్కారింతలకు, కేళాకోళాలకు బలియౌతూ వచ్చాడు అంట కత్తెరలోంచి క్రాఫింగ్ వరకూ వచ్చినా డబల్ బ్రెస్ట్ కోటు వేసినా, ట్వీడుసూటు వేసినా అతనూ అతడి నడకనూ కతియోజనాల దూరంనుంచి దుర్భిణీవేసి చెప్పవచ్చు ఇంటర్మీడియేటువరకూ అతను హాస్టల్లో త్రికాలాలూ సంధ్యవార్చేవాడు అక్కడికి మెస్ రెండుమైళ్ళదూరం వుండేది ఈ రెండుమైళ్ళూ పెద్దాపురం పట్టుపంచె పిళ్ళగోచీపెట్టి తడిఉత్తరీయాన్ని బుజాన్నేసుకుని చేతిలోని రాగిచెంబుతో భోజనానికి శ్రీ మల్లవరపు వల్లభరాయుడుగారిలా బయల్దేరి వాతినంటుకుపోతూవుంటే, ఆ పిలక గగనసీమల్లో సంచారంచేస్తూవుంటే, క్రొత్తగా మొదటి సంవత్సరంలో చేరినవాళ్లు దగ్గర్నుంచి, ఫైనలియ్యరు వరకుఆడ—మగా అన్న విచక్షణాభేదం లేకుండా అంతా నమస్కారాలు చెల్లించి భక్తితో త్రోవ యిచ్చేవారు కొందరు భక్తగణంలోనివారు అతడ్ని అక్కడే నిలేసి లెక్కలూ గ్రటా తెలియనివి చెప్పించుకుని మరీ వదిలేవారు

అహోబలరావు రామానుజులవారి మతానికి హృదయాన్ని అంకితం చేశాడు విష్ణుచిత్తీయము అతడు తలక్రిందపెట్టుకు నిద్రపోయే గ్రంథం అహోబలరావు విశిష్టాద్వైతికూడా—పరబ్రహ్మైక్యశ్రుతను వచ్చినా వప్పుగోడు చరిత్రకారులు కొంతమంది కాలేజీలో చదువుకునే రోజుల్లో అహోబలరావుకి 'ప్రవరాఖ్యుడ'నే గౌరవ నామం వున్నట్లు కూడా చెబుతారు అతను అన్ని తరగతుల్లోను ఉత్తమశ్రేణిలోనే వచ్చాడు. కాని ఆనర్సులో సెకండ్‌క్లాసు. అక్కడే వచ్చింది గట్టి చిక్కు, విశిష్టాద్వైతం కొంపముంచింది.

ఆచార్య శివశంకరరావుగారు ఎవరో చెప్పారు, అహోబలరావు ఎంత సూపర్‌స్టిషన్ మనిషంటే అతను వక్షుత్రాళ్న స్పృదు శివ శివా! అనిగాని, హర హరా! అని గాని ఎవరైనా అన్నట్లయితే చెవులు రెండూ మూసుకుని వినపడనంత దూరం పరుగెత్తుతని ఆయన ఒకరోజు స్వయంగాపిలిచి 'నాపేరేమిటి చెప్పు'ని అడిగాడు 'హరిహర్' నేను చెప్పవచ్చాడు అహోబలరావు అయినూరు కానీ నూరాయు కానీ నేను నైత నామోచ్చారణచేయ నన్నాడు. అతను తిరునామాన్ని తీర్చి దిద్దితే యిక. యిప్ యిం రైలుపెట్టెమీద పట్టి వర్ణనాలకన్నా ఎక్కువ స్పష్టంగా గోచరించేది చివరకా విశిష్టాద్వైతమే అతని ఫస్టుక్లాసు కత్తిన్ని దూరంచేసి మరీ వదిలింది. ఐతే యూనివర్సిటీకల్లా ఫస్టుగా రేంకులో నిల్చొవలసినవానికి ఫస్ట్‌క్లాసు రాకపోగా, మెడపట్టుకు గెంటితే సెకండ్‌క్లాసు గుంపులోకొచ్చి పడ్డట్టు తెలియగా ఆ తెలిసినరోజుల్లోనే అహోబలరావును గంటకొకసారి రైల్లో నెక్కించాల్సినంత పనయింది తరువాత కొద్దిరోజులకేగా జరిగింది కాన్వొకేషను. అప్పటికీ ఫస్టుక్లాసు రాలేదేమా అన్న విచారం మానవుడ్ని పట్టుకు వదల్లేదు ఉద్యోగం దొరికాక యిప్పుడావిచారంమాయమైంది దానిస్థానేలోకంలో బ్రతకటానికి జీవితయాత్రను సరిగా వెళ్లబుచ్చటానికి ఒక యూనివర్సిటీడిగ్రీతే చాలదని ఎన్నో సుగుణాలు మెలకువలు మాయలు మోహాలు కుతంత్రాలు నేర్చుకోవాలని లేకపోతే అధోగతి అన్నది నిర్చయమే! అని తేలింది

అలివేలు దీపం వెలిగించుకొచ్చి—'ఇంకా యిక్కడే కూర్చున్నారేం? నిద్రారావటంలేదా—' అని ఆశ్చర్యంతో అడిగింది.

'ఇటురా కూర్చో' అలివేలు మాట్లాడకుండా వచ్చి కూర్చొని, 'ఎందుకండీ అంత దిగాలుపడిపోయి కూర్చున్నారు యింట్లో యీనాటి మీ అమ్మమ్మ యేమన్నా జ్ఞాపకొచ్చిందా!' అని పెంగు చాటు చేసుకుని నవ్వింది అహోబలరావు అలివేలిని చూస్తూ—

'ఇక మనం అమ్మమ్మనే జ్ఞాపకం చేసుకుంటూ కూర్చోవాలి.'

'ఏం అలా అంటున్నారు?' అని తన చేతిలోకి అతడి చేయిని తీసుకుంటూ అంది

అంత అందమైన కళ్ళల్లోకి చూస్తూ—'నేను చెప్పలేను చెప్పి నీ మనసుకూడా పాడుచేయలేను' అన్నాడు సంకోచంగా

'నా మనసు మీ మనసులాటిది కాదుగా' అంది అలివేలు

'ఏమైనా పాడవుతుంది ఎందుకు చెప్పటం?'

'చెప్పకపోతే నాచుకోండి రెండి భోంచేద్దాము'

'నా ఆకలి లేదు నువ్వు తిను'

'మీరు తినకుండా నే నెప్పుడన్నా తిన్నానా?'

'ఇవాల్టికి తిందూ— నా మనసు బాగులేదన్నానుగా'

'ఏవిటి ఆ విజయ అన్న అమ్మాయి యేమన్నా చేసిందా?' అలివేలు నవ్వు నాపుకుందుకు యత్నిస్తూ ప్రక్కకు తిరిగి అంది

'ఏమిచెయ్యాలో అదే చేసింది ఐనా అమ్మాయి ననవలసిన పనేముంది మన ప్రారబ్ధమే అట్లాగుంది ఆ యనేం చెప్పటం లేదనీ, యీయన మనకు అక్కర్లేదంటూ డిప్యూటేషను వెళ్లారు ఉద్యోగం వుంటుందో వూడుతుందో తెలీదు ఇటువంటప్పుడు అన్నం యెట్లానయిస్తుంది చెప్పు?'

'నోస్—యింతేనా!' అంది అలివేలు

'ఏం యిది చాలదా?'

'అదికాదండీ—మీ కెందుకు కోపం ఉద్యోగ్యం వెయ్యటం కష్టంగాని తియ్యటం అంత తేలిక కాదు'

'ఓహ్హో—నీకు బాగా తెలుసు'

'అబ్బ! నాకు తెలుసండీ. మీకేం ఫరవా లేదు వచ్చి భోంచెయ్యండి'

'నేను తన్ను చాలాసార్లు అవమానించటానికి ప్రయత్నించినట్లు ఆ అమ్మాయి రిపోర్టులో వ్రాసింది' అన్నాడు దిగులుగా

అలివేలు గది ప్రతిధ్వనించేట్లు నవ్వి— 'మీరా—మీరు నిజంగా అటువంటిపన్లు చేశారా?' అంది.

'నే నెప్పుడూ చెయ్యలేదు. చెయ్యను.'

'అవమానించటానికి ప్రయత్నించటం అంటే'

'నాకొంద—నే నెప్పుడూ ఆ అమ్మాయి ముఖంలోకి చూసి నవ్వదన్నా నవ్వలేదు'

'మీరు నిజంగా అట్లా చూసి నవ్వివుంటే కథ యింతవరకూ రాక పోను'

'అలివేలూ—ఏవిటే వేళాకోళం? యిది ఎటువంటి సమయం—రేపు మనం ఎక్కడ తలదాచుకోవాలి' ఆ ఆలోచన వచ్చేసరికి బుర్ర పగిలిపోతల వంకే—'

'ఏవిటండీ—బుర్ర పగిలేది? నిజంగా తన్ను అవమానించే ప్రయత్నాలు మీరు చేస్తున్నట్లు ఆ అమ్మాయి వ్రాసిన రిపోర్టు నాధారం చేసుకొని మీ మీద చర్య తీసుకుంటారనా?'

'నో తప్పకుండా'

'అప్పుడు చక్రం అడ్డువెయ్యలేనో '

'ఏవిటి నువ్వా ' అన్నాడు కుర్చీలోంచి లేచి అహోబలరావు

'అవును—నేనే ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళినా ఆసాంతం చూసి గెల్చుకవస్తాన మీ కోసం నేను ఏది చెయ్యలేను?' అహోబలరావు 'ఊ నా చేయి పట్టుకో—' అలివేలు తిలువులు తెరిచివచ్చి 'అందివ్వండి' అంది 'ఇదుగో— అమ్మయ్య యిప్పుడు కుర్చీలోంచి లేచాను ప్రాణం ఎంత తేలిగ్గా వుంది.' వంటయింట్లోకి నడుస్తూ 'ఉంటుంది మీకు నిజంగా ఆపిల్ల అంటే అంత భయమేమిటండీ?'

'భయం కాకపోతే—ఆ అమ్మాయిని రెండు చెవులూ నులిమెయ్యమనా, గోడకుర్చీ వేయించమనా ఏవిటి నీ అభిప్రాయం?'

'అంతకన్నా ముఖ్యమైన శిక్ష వుంది గట్టిగా రెండు చేతుల్లోకి తీసుకుని నలిపేసి వుంటే ఆ అమ్మాయి యిట్లాటి పెంకిపన్లు ఎప్పటికీ చెయ్యకుండా వుండేది'

పీట వాల్చుకుని కూర్చొంటూ 'ఆ పని నేన్నే చెయ్యాలనా—'

అలివేలు కంఠం ఎత్తిపట్టుకుని 'నిజంగా మీరే ఆ పని చేసివుంటే నా కెంత గర్వంగా ఉండేదని.'

'ఊరికే కైకంటావు సేవ చెయ్యటానికి చెయ్యి లేదని తెలుసు గనక'

అలివేలు నవ్వి 'అందరికీ మల్లే అసూయపడకండి. నా—ఒక్క నాటికి పనసు మీరా పని చెయ్యండి' మళ్ళీ ఆ అమ్మాయి '

'భ ళ నే నక్కడ్నుంచి లేచిపోతాను నువ్విట్లా మాట్లాడావంటే'

'మాట్లాడను లెండి ఈ పచ్చడి కల్పుకోండి యిది మీ కిష్టమని చేశాను'

పచ్చడి నాలుక్కి రాసుకుని 'నీ చేయి దివ్యమైన రుచుల్ని పుట్టిస్తోంది వుండు నా బుజంమీద చెయ్యేస్తా వేమిటి? అదుగో వాళ్లంతా కిటికీలోంచి చూస్తున్నారు'

'పోండి. ఎవరూ లేరు అంతా అబద్ధం ఇవ్వాళ నేను మడికట్టుకోలేదు తెల్సా' చిత్తం గ్రహించానన్నాడు అహోబలరావు చందమామ వెన్నెలలు విరియించాడు సన్నజాజులు నవ్వినై

## 8

తెల్లారి లేస్తూనే 'యీవాళ నన్ను మాట్లాడించకండి మీ పన్లు మీరు తెముల్చుకోండి నా కూ పన్లున్నాయ్ ఇంటికి తాళంవేసి మధ్యాహ్నం అలా వెళ్లివస్తాను కొంచెం పర్మిషను యిస్తారా?' అంది అలివేలు

'విషయం చెప్పు' అన్నాడు టూత్ బ్రష్ తిరగేసి తల బరుక్కుంటూ—

'అసలు విషయం ముందు చెబితే కథ ఎప్పుడన్నా రక్తి కడుతుందీ?' అంది కాఫీకోసం కుంపటంటిస్తూ అలివేలు

'ఇప్పుడు నువ్వు నాకేదిటి కథ చెప్తావ్?'

'మంచికథ అనగా అనగా ఒక అబ్బాయి వున్నాడు ఆ అబ్బాయి ఒక మంచి నాజూకైన అమ్మాయిని సైకిలు మీంచి పడగొట్టాడు. అప్పట్నుంచి వాళ్ళ మనస్సులో రాగద్వేషాలు రాజుకొంటూనే వున్నై.' అహోబలరావు పొడుమంగా—'నేను నువ్వు చెప్పేకథ వినదల్చుకోలేదు. నీకు ఆకథలో సంబంధంలేదు.'

'సంబంధం లేదంటే మీకు ఉద్యోగం వూడుతుంది.'

'వెళ్తే యింతకీ నువ్వేమిటి చెయ్యదల్చుకున్నావు ఇల్లిల్లా వెతుక్కుంటూ వెళ్తావన్నమాట. నా అవస్థ నే నేదో పడ్తాను కావలిస్తే క్షమాపణ పత్రం వ్రాసియిస్తాను నువ్వెందుకు నీకు శ్రమయ్యుంటుంది—ఎక్కడికి వెళ్ళొద్దు'

'అనవసరంగా మీరు ఆ అమ్మాయికి క్షమాపణపత్రం వ్రాసియిచ్చి మర్నాడు మీరా కాలేజీలోనే పాఠం చెప్పదల్చుకొన్నారా? అట్లా ఒక్కనాటికి జరగటానికి వీల్లేదు నేను వెళ్లి మీ విజయను కల్సుకుని మాట్లాడివస్తాను మీ తరఫున నాకు వకాల్తీ యివ్వమని ప్రార్థిస్తున్నాను ఎందుకు ఘోరంగా ఆలోచిస్తున్నారు? యేమిటా సంశయం?'

'ఏమీ లేదు బ్రహ్మదేవుడు నన్నో భార్యను చేసి నిన్ను భర్తను చేసి వుంటే ఎంత బాగుండి పోయేది అని'

అలివేలుకి కోపమొచ్చి యింట్లోకి వెళ్లిపోయింది తరువాత వాళ్లుమాట్లాడుకోలేదు అరగంట సేపు అలివేలే ఆ యుద్ధాన్ని రాజీలోకి తెచ్చే ఉద్రేకంతో 'ఇదుగో, మిమ్మల్నే, మన యీవాదనలో కూరల మనిషి కేక వినిపించుకోలేదు కూరలట్లాండి బజారుకెళ్లి ఎట్లా తెస్తారో చూస్తాను!' అంది అహోబలరావు పంచెపుచ్చుకు వీధిలోకొచ్చి 'ఎట్లా తెస్తానో చూస్తుందట నాకేమి అంత లోకజ్ఞానం తక్కువా?' అంటూ మార్కెటు వరకూ సాగిపోయాడు వీసా వీసా ఎట్లా యీగా గమనిస్తున్నాడు ఏదన్నా హెచ్చు తగ్గులవస్తే అలివేలు తప్పకుండా చెప్తుంది కూరలవాళ్లు తనది క్రొత్త మొహమని ధరలెక్కువ చెబుతారో, తప్పుడు తూకాలు తూస్తారో—అట్లాటి వేషాలు తన దగ్గిరా? హనుమంతుడిముందు ఎవరన్నా కుప్పిగంతులు వెయ్యగలరా? ఇట్లా అనుకున్నప్పుడు పొంగుకొచ్చిన ఆవేశంతో ఎదురుగుండా కనిపిస్తూన్న ఒకటి రెండుకూరల దుకాణాలప్రక్కనుంచి కాలీసంచీ నలుగురికి కన్పించేలా వూపుకుంటూ ఒకసారి నడిచాడు అమ్మకం కోయిలో—కోవైపునుంచి గోనెక్రిందకు డబ్బులు, నోట్లు, వెళ్లినవి వెళ్తూండగా అటువంటి మంచి రద్దీలో చేరగాళ్లు గంపలమీదకు యీగల్లా ముసురుకొన్నప్పుడు, లేచి 'రండి' అని అహోబలరావును ఎవరు

గద్దాలకు నచ్చరాని శాస్త్రాలు భోజనాదికాలు పూర్తిచేసుకుని నీ వేళ సౌందర్యమ్మాయి లవ్వాతే ముత్యాలకు చిహరితీర్చ ల్నిచ్చే సమయం విజయకు గుండెల్లో గుబులొచ్చిపడింది. రేపు తనకూ కాలేజీతో ఋణం తీరిపోతుందని తెలియని అనాలో బలరావు చివరి ఉపన్యాసంతను వినటాని కెళ్ళాలి వెళ్ళి అక్కడ కూర్చోటానికి తనకెంత యిష్టములాటి కఠినహృదయం కావాలి రేపు అతను అలాలకూ అని ఉద్యోగం పోయి రేకుస్తాడు అతని క్రొత్త సంసారం కాకులికి గ్రద్దలకి అవుతుంది ఆ కాకులూ గ్రద్దలూ ఎవరు? విజయగుండె దప్పునతగినట్లయింది

కాలేజీకి వెళ్ళటంకోసం తీసిన పుస్తకాలు బల్లమీద గిరాటువేసి చేతుల్లో ముఖాన్ని కప్పుకుని కూలబడిపోయింది కుర్చీలో విజయ కిటికీలోంచి క్రిందకు చూస్తే బజారుగోడను చార్లవేసి వుంచిన కుక్కాకుర్కాన లేడీసైకిలు 'క్రోధం బహు చెడ్డ వస్తువు సుమా' అని హెచ్చరిస్తోంది విజయ దిగాలు పడ్డ ముఖంతో అటూ యిటూ తిరుగాడుతూండటాన్ని గమనించిన దమయంతి 'కాలేజీకి టైము కాలేదుటే—లేచి అన్నానికి రా' అని ఒకటికి రెండుమార్లు కేకేసింది విజయ లేచి వంటయింటి గుమ్మంలోకొచ్చి 'ఈవాళ కాలేజీకి ఎల్లా వెళ్ళను? వెళ్ళలేనే అక్కా—' అంది కాలితో నేలను రాస్తూ సరిగ్గా యిదే సమయానికి విజయ తల్లి చిన్న కూజాబిందెను నీళ్ళతోసహా ఎత్తి కుడివై లోనికి రొప్పుతూవచ్చి 'అదే—అదే అది వచ్చిందే—యింట్లో ఎవరూ లేర ఎల్లాగ బాబూ!' అని కంగారుగా యిటూ అటూ చూసింది దమయంతి చెరగు మీదకు లాక్కొని వీధిలోకొచ్చింది వెనకాలే విజయ మెల్లిగా అడుగులో అడుగేసుకుంటూ మెడ రిక్కించి ముందుకు చూసింది.

గేటు ఒత్తిగించి నవ్వుతూ అలివేలు 'క్రొత్త చుట్టాన్ని ప్రసాదరావుగారి మరదల్ని పరిచయం చేసుకుపోదామని వచ్చాను' అంది

దమయంతి 'రండి' అంటూ ఎదురుగా వెళ్ళి 'మీవారు కాలేజీలో లెక్చరరు గదూ' అని చేయి పుచ్చుకుని మెట్లమీదనుంచి నడిపించుకెళ్ళింది విజయ తల్లి ఖంగారుగా వెనకనుంచి విజయను జబ్బ పుచ్చుకు లాగుతోంది లోనికి రొమ్మని యిష్టకుని. విజయ తల్లిని విదల్చుకొని పోయలోకి వచ్చి పచ్చటి పసిమి రంగుఛాయతో మెరుస్తూన్న అలివేలు రూపాన్ని తీర్చినట్లు కట్టిన ఆమె తెంపుగంగు చీరను, ముఖాన్ని శుభసంపత్కరచిహ్నంగా దిద్దుకుంగున్న కాసు పెట్టున్న కుంకుమను, ఆశ్చర్యంతో చూడసాగింది.



దమయంతి 'ఈ అమ్మాయే. మీవారి శిష్యురాలు' అంటూ పరిచయం చేయబోయింది. అలివేలు 'నట్టి శిష్యురాలే—విజయ కదూ మీ పేరు. మీరే కాలేజీలో పని చేస్తున్నా రనుకొని మావారు పొరబడి ఒక క్లాసు వదిలేసారట నిజమేనా?' అంది నవ్వుతూ అలివేలు

విజయ 'నిజమే ' అనేసి దగ్గరగా వెళ్ళి ఆమెలోకి చూడసాగింది అలివేలు దేనికోసమో వెతుకుతూన్నట్లు చూసి 'ఏరిమీ అమ్మగారేరి? వారి యెడల కొంచెం దురుసుగా ప్రవర్తించాను క్షమించమని అడగాలి' అంటూ లేచింది

అప్పటికి విజయతల్లి పొట్ట పోయినవిందెను మెల్లిగా వంకరలు తీస్తోంది అలివేలు దప్పున ఆవిడ రెండు చేతుల్నీ పట్టుకుని 'పిన్నిగారూ! చిన్నవాళ్లను మీరు క్షమించాలి అప్పుడు కొంచెం దురుసుగా ప్రవర్తించినమాట నిజమే ఇప్పుడు మీ స్నేహం కోరివచ్చాను'

విజయ తల్లి క్రిందు మీదై 'హా హా హ్హా!' అని మాత్రం అనగలిగింది దమయంతి 'మాయిల్లు దూర్రు గాని రండి' అంటూ వంట యింటిలోనికి తీసుకుపోయి పీటవేసి కూర్చోపెట్టి పుట్టింటా రేపూరో అన్నీ వాకబులు చేయ నారంభించింది తన పుట్టినిల్లు రాజమండ్రి అనీ తన తండ్రి హైస్కూల్లో మాస్టరనీ అన్నీ చెప్పాక విజయకేసి తిరిగి 'మిమ్మల్ని మాట్లాడించటం ఎట్లాగో నాకు తెలియడం లేదమ్మా ఎందుకంటే నాకు వచ్చినచదువు చాకలిపద్దుల వరకే—అంతే ఇవ్వాళ మీరు బడికిపోతే నట్లుంది బిక్కిటి నా మొహం! కాలేజీ అనాలికా మాకు'

విజయకి మాట నవ్వు వచ్చింది నిజంగా. 'వొంట్లో ఏమీ బాగాలేక వెళ్ళలేదండీ' అంది.

దమయంతి కాఫీ తెచ్చియిచ్చింది విజయ దొడ్లోనని పూలుకోసుకొచ్చి 'యివియివి తీసుకోండి' అంది అలివేలు కొంచెం గంభీరంగా 'అమ్మా నేను నిజంగా నిన్నొకటి యాచించటానికి వచ్చాను అతిథ్యాల్ని స్వీకరించటానికి రాలేదు కాని మీ మంచి మనస్సులతో యిస్తే అది ఎట్లా కాదనను!' పూలందుకుంది దమయంతి 'ఎందుకండీ అట్లా అంటారు! అదిచిన్నపిల్ల దానికేం తెలుసు?' అలివేలు నవ్వి 'ఇప్పుడీమె యెంత చిన్న పిల్లో యింతకన్నా తక్కిరట్ల పసిపిల్ల డొకడున్నాడు మాయింట్లో అతని చేష్టలకన్నా మీకున్నా కష్టం నష్టాలు కలిగితే మన్నించమని అడగటంకోసం వచ్చాను. ఆయనకేమీ తెలియదు. నాకు తెలియనివి

నాటిల్లదు. దేవతలందర్నీ విస్మరించరు. నా వ్యక్తి కేవలం మూలంగా నాకేమీ హాని జరిగిందని భావించకండి నాకు మంచి చేయాలనే ఉద్దేశ్యం వారికి లేకపోయినా, వారు నాకేమీ కీడు చేయలేదు.

మిత్రులు బిడ్డలున్న తండ్రి అమాయకురాలు భార్య వీరిగతి ఏమికావాలి?

సోక్ర నా పుత్రులు పెరిగి పెద్దయాక, సత్యంమీదకన్న సంపత్తుమీద నా కెక్కువ మక్కువ చూపిస్తే వారిని శిక్షించండి బాధించండి ఈ ఉపకారం మీరు చేస్తే నాకూ, నా సంతానానికి మంచిచేసినవా రవుతారు.

ఒకరు విచారణ ముగిసింది మీ రిక వెళ్ళవచ్చు!

మిత్రులు సోక్రటీస్

సోక్ర మనకు వీడ్కోలు సమయం వచ్చింది ఎవరిదారిన వారు వెళ్ళక తప్పదు నేను మరణించటానికి మీరు జీవించటానికి. ఏది ఉత్కృష్టమో ఈశ్వరుని కెరుక

(పాజ్)

సోక్ర క్రిటో అప్పుడే వచ్చావు?

క్రిటో అవును ఇంకా సాంతం తెల్లవారలేదు

సోక్ర జైలుకావలాదారి నిన్ను రానిచ్చాడా?

క్రిటో : అతను నన్నెరుగును

సోక్ర మరి నన్ను లేపకుండా కూర్చున్నావేం?

క్రిటో ఇట్టి విషమసమయంలో కూడా నువ్వు ఇంత ప్రశాంతంగా నిద్రపోవటం నాకు ఆశ్చర్యం అట్టి పవిత్ర నిద్రను భంగం చేయదలచుకోలేదు

సోక్ర : ఈ వార్ధక్యంలో మృత్యువును చూసి విచారించకూడదు

క్రిటో : నీకన్న ముదుసళ్లు కూడా ఇలాంటి సమయాల్లో ఖేదం పొందకుండా ఉండలేరు

సోక్ర : నిజమే మరి. నువ్వెందుకు వచ్చిందీ చెప్పలేదు.

క్రిటో. నేనిదివరకడిగిన కోరికే మళ్లీ అడుగుతున్నాను. సోక్రటీస్.. జైలునుంచి నువ్వు పారిపోవాలి.

సోక్ర : క్రిటో

క్రిటో. అవును సోక్రటీస్.. నీవు చనిపోతే సాటిలేని స్నేహితుని పోగొట్టుకోటమే కాక, ప్రజల ఆగ్రహానికి గురవుతాను

సోక్ర ప్రజల ఆగ్రహానికి

క్రిటో అవును నిన్నూ, నన్నూ ఎరుగని ప్రజలు నన్ను నిందిస్తారు. డబ్బు ఖర్చు పెట్టటానికి ఇష్టం లేనందువలన నిన్ను రక్షించలేకపోయానని, నేను నిర్లిప్తుడుగా ఉన్నానని వారు అంటారు

సోక్ర క్రిటో

క్రిటో అంతకన్న అవమానం ఉందా? స్నేహితుని, అందులో నీలాంటి స్నేహితుని ప్రాణం కన్న నాకు ధనం ఎక్కువా? పారిపోవలసిందని నేను నిన్ను కోరినట్లు, నీవు తిరస్కరించినట్లు వారికి తెలియను చెప్పినా వినరు

సోక్ర క్రిటో జనాభిప్రాయంగురించి భయపడొద్దు సత్పురుషులు ఈ సంఘటనను సరిగానే అర్థం చేసుకుంటారు వారి మాటే ప్రమాణం

క్రిటో సోక్రటీస్.

సోక్ర క్రిటో రానున్న మృత్యువునుంచి తప్పించుకొని ఎలాగో ఎక్కడో తల దాచుకుని జీవించమని నీ కోరిక.

క్రిటో అవును

సోక్ర కాని కేవలం జీవించటమే ప్రధానం కాదు అమూల్యమైనది కేవల జీవితం కాదు స్వచ్ఛ జీవితం క్రిటో అధికారులను శాసనాన్ని మోసపుచ్చటం అయుక్తమైనదని మనం ఆ అపకార్యం చెయ్యకూడదు అవునా

క్రిటో కాదని ఎలా అనగలను?

సోక్ర మనను బాధించినవారిని కూడా మనం బాధించకూడదు

క్రిటో అవును

సోక్ర : ప్రతీకారచింతను త్రోసిపుచ్చాలి.

క్రిటో అవును

సోక్ర ఈ పలాయనచింత వింతటితో విరమించు.

క్రిటో : ఇందుకు నే నొప్పుకోగలిగిందేమీ లేదు. సోక్రటీస్..

సోక్ర: కాబట్టి. క్రిటో దైవేచ్ఛకు నన్ను విడిచిపెట్టు దైవం ఏదారి చూపితే, అదే నాకు పూలబాట..

జైలరు సోక్రటీస్

సోక్ర జైలర్. రా నాయనా. రా

జైలర్: ఇక్కడకు చాలామంది వచ్చారు. కాని మీలాంటి సాధువు నింతవరకూ ఈ సంకెళ్లు తాకలేదు నేనంటే మీకు కోపం

సోక్ర నువ్వంటే నాకు కోపం!

జైలరు కోపం లేదని నాకు తెలుసు ఇక్కడ ఉండేవాళ్ళకు మామూలుగా నేనంటే చాలా కోపం నన్ను తిట్టుతారు శపిస్తారు

సోక్ర నీపై కోపం అనవసరం నీవిధి నువ్వు నిర్వర్తిస్తావు

జైలరు అధికారుల ఉత్తరువుల ప్రకారం విషమిచ్చే కఠోర కర్తవ్యం నాది ఆ దోషం నాది కాదు ఇతరులది

సోక్ర అది గ్రహించకే నీమీద కోపపడటం

జైలరు ఈ చీకటిగుహలో చిక్కుకుపోయిన మాలాంటి వాళ్ళకు వెలుతురు చూపించటం కోసమే భగవానుడు మిమ్మల్ని ఇక్కడకు పంపింది దొంగలను, హంతకులను, వంచకులను బంధించే సంకెళ్లే మిమ్మల్ని కూడా బాధిస్తున్నాయ్

సోక్ర ఈ కారు రాళ్ళమనస్సు మీ హృదయాలుకూడా పాషాణాలు అవుతాయని అంటారు కాని. నే నా మాట నమ్మను నే నిక్కడకు వచ్చినప్పటినుంచి చూస్తూనే ఉన్నాను ఆ గోడచాటుగా వెళ్లి నువ్వు దుఃఖించటం

జైలరు అవును సోక్రటీస్ మాలో మానవత్వం నశించటం సత్యమే కాని మీ ముఖ ప్రసన్నత, మీ చర్చల ప్రబోధం వ్యతిరేకులంటే మీకున్న సహనం ఇవన్నీ నక్షత్రాలై ప్రకాశిస్తుంటే మా చీకటిగుండెల్లోనూ వెలుగు నిండుతుంది ఓ ప్రభూ ఇదివరకు ఎంతో మందిని మృత్యు ద్వారం వద్దకు తీసుకువెళ్లాను కాని వాటన్నిటికీ క్షమించలేకపోయినా ఈ సారికి క్షమించు.

సోక్ర: ఇందులో నీ దోషం లేదు. నీ అపరాధం లేదు.

జైలరు: ఓ అంతర్యామీ.. ఆ పవిత్రమైన పెదవులు తాకినప్పుడు ఈ విషాన్ని అమృతం చెయ్యి. సోక్రటీస్. జరుగనున్నదాన్ని క్షమతో సహించాలి.. మరి నాకు సెలవు

సోక్ర: క్రిటో విషం తయారైతే, పరిచారకుని తెమ్మను.

క్రిటో ఎందుకంత తొందర? సోక్రటీస్.

సోక్ర ఎవ్వరది క్రిటో ఆ ఏడ్పు

క్రిటో నీ ఇల్లాలు పిల్లలు సోక్రటీస్

సోక్ర: ఆఁ ఆఁ సహనం వహించాలి. దేవగృహంలోకి వచ్చే ముందు ఈ అపస్వరాలు స్వర్గంలో వినబడకూడదు

భార్య పాపిష్టిరాలిని ఉన్నంతకాలం మనశ్శాంతి లేకుండా రొష్టు పెట్టాను

సోక్ర ఎందుకా ఆవేశం

భార్య అవును సంసారానికి నిష్ప్రయోజకుడవని కత్తిన నోరు పెట్టుకుని అరిచేదాన్ని కాని కాని వీధి వీధిన వాడ వాడన ధనికులు. దరిద్రులు, యువకులు, వృద్ధులు, పాపులు, పుణ్యాత్ములు మీకై ఘోషిస్తున్నారు

సోక్ర విలపించకు విలపించకు

భార్య: ఇంతటి విశ్వపురుషుని ఇంట్లో పెట్టుకుని, ఇన్నాళ్లూ అవమానించాను అందుకే ఈ ఘోర శిక్ష నాకు విషమనుకన్న దాహకమైన ఈ శోకాగ్ని నన్ను

సోక్ర పిల్లలు చూడు ఎలా బెదురుతున్నారో వాళ్లు భయపడుతారు.

భార్య అత్తనిలాంటి తల్లిని మాకీ భయ పడాలా? క్షమించండి ఈ క్రోధ కదే ఉపశమనం.

సోక్ర నేను జీవించినన్నాళ్లు, నీకు జ్ఞాన ప్రబోధం చేయలేకపోయాను సంఘటనలూ ఊరికే రావు నీ అంతరాత్మ మేల్కొంది. ఈ సమయంలో అంతకన్న నాకు కావలసిందిలేదు ఈ ఒక్క క్షణం యుగాలకు సమానం వెళ్లు పిల్లలను తీసుకో వెళ్లు.

భార్య ఎక్కడకు! ఎందుకు? నాకు నేనే చివరిపాత్ర. నాకు నేనే విషం ఇవ్వండి. నాయనల్లారా పదండి. శ్రీ లోకానికి నా ప్రార్థన... ఇంక ఈ మహాపరాధాన్ని మరెవ్వరూ చెయ్యకండి...

(పాజ్)

సోక్ర క్రిటో చెప్పావా పరిచారకునికి

క్రిటో సోక్రటీస్ సూర్యుడింకా పడమట కొండలపైనే ఉన్నాడు. చాలామంది ఆలస్యంగా విషం తాగటం నే ఎరుగుదును

సోక్ర ఎందుకు ?

క్రిటో అధికారులు ఆదేశించాక కూడా, విందులారగించి, తాగి, ప్రియులతో కాలక్షేపం చేయటం నే ఎరుగుదును కాబట్టి తొందరపడవద్దు వ్యవధి ఉంది

సోక్ర అవును, క్రిటో వాళ్ళలా చేయటంలో తప్పేమీ లేదు ఆలస్యం చేసినందువలన ఏదో లాభిస్తుందని వారి ఆలోచన వాళ్ళను నే అనుసరించటం యుక్తం కాదు ఒక క్షణం ఆలస్యంగా విషం తాగినందువల్ల ప్రయోజనం ఏమీ లేదు కాబట్టి నే చెప్పినట్టు చెయ్యి అదిగో జైలరు వస్తున్నాడు

జైలరు : సోక్రటీస్ ఇదిగో విషపాత్ర— విషం తాగాక, కాళ్లు బరువెక్కేంత వరకూ నడవాలి తరువాత పడుకోవాలి అప్పుడు విషం పని చేస్తుంది

సోక్ర సరి ఏదీ ఊఁ ఇటివ్వు ఆ విషపాత్ర

క్రిటో ఇతర మిత్రులు సోక్రటీస్ నీ అమృత కంఠంలో హాలాహలం

(నిట్టూర్పులు, దుఃఖారావాలు)

సోక్ర మిత్రులారా ఏమిటీ నిట్టూర్పులు దుఃఖం ఇలా! దురపిల్లుతారనేగా ఆడవాళ్ళను ముందు పంపింది. ప్రాణి ప్రశాంతంగా చనిపోవాలి ప్రశాంతంగా ఉండండి

క్రిటో అలాగే సోక్రటీస్ మనశ్శాంతిని భగ్నం చేయవద్దు అతో అదేమిటి ఏమంటున్నాడు సో క్రటీస్ సోక్ర .

సోక్ర క్రిటో క్రిటో

క్రిటో ఏమిటి ? సోక్రటీస్ .

సోక్ర . క్రి...టో..

క్రిటో చెప్పు . సోక్రటీస్

సోక్ర : క్రిటో అస్లీపియస్ నాకు ఒక కోడి నిచ్చాడు అది అతనికి తిరిగివ్వలేదు నేను ఇంతవరకు .

క్రిటో : సరే.. ఇప్పుడెందుకు ఆ సంగతి

సోక్ర కాదు క్రిటో అలా మరచిపోకూడదు ఇవ్విస్తావా అతనికి కోడిని

క్రిటో ఇస్తాను

సోక్ర గుర్తుంచుకుంటావా?

క్రిటో తప్పక సోక్రటీస్ ఇంకేమైనా నీ అభిమతం

(పాజ్)

* ఓ జగత్పతీ! ఎవ్వరనీ జగాన నీ ఎరుక లేక శోకము నించినారె ఏటికి యీ యశ్రువులు నీదు సృష్టియందు

కథకుడు సోక్రటీస్ నుంచి జవాబు రాలేదు. ఒక జిజ్ఞాసువు అస్తమించాడు అతను లోటి వారికి జ్ఞానమార్గము చూపగా, వారతనికి మృత్యు ద్వారం చూపించారు కాని జ్ఞానయాత్ర మృత్యు ద్వారం వద్ద ఆగదు అది అమర యాత్ర

* * * *

ఒకరు అసురుల కాలమెప్పుడో అనుకున్నాం

ఇంకొకరు గ్రామ గ్రామం భయంతో అట్టుడికి పోతోంది అంగుళిమాల చక్రవర్తి వస్తున్నాడంటే, యోజనాలదూరంలో భూకంపంలో లాగా ప్రజలు కంపిస్తున్నారు

ఒకరు ఇలాంటి కిరాతకుని బుద్ధభగవానుడు మారుస్తాడటం ఈ శాంతి దేవుని ఆ రాక్షసుడేం చేస్తాడో

ఇంకొకరు బుద్ధభగవానుడు ఆ దురాత్ముని మార్చలేవును అయ్యయ్యో ఆ ప్రేమస్వరూపుని అహింసాత్ముకునేం చేస్తాడో

బుద్ధుడు అంగుళీ మాలాలంకృత చక్రవర్తి శుభం

చక్రవర్తి : ఎవరది ? నా దర్పానికి ఈ కాషాయములకు తావులేదు.

బుద్ధు కాని నా హృదయమున ఎట్టి అనుమతి నవసరమైనా కావుండి.

* తెలిదాని చంద్రశేఖరంగారి 'గతేరుణ' నుంచి

చక్ర : ఈ నటన నాటకత్వ వృథా.. ఇట్టి మాయ మాటలతో నన్ను మోసపుచ్చలేవు

బుద్ధు : వంచనకు విరోధిని నేను. ప్రభూ సత్యానికే నా ప్రణామము

చక్ర : సత్యమని మిథ్యయని

బుద్ధు : మీరు సత్యానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు మీరు సల్పుతున్న హింస మీ మానవత్వానికి కళంకము

చక్ర : ప్రతిపక్షులను హతంచేసిన వీరాధివీరునితో నువ్వు మాట్లాడుతున్నావని తెలుసుకో వెంటనే నువ్విచటనుంచి నిష్క్రమించటం మంచిది లేదా

బుద్ధు : భయానికి అపరిచితుడు బుద్ధుడు

చక్ర : ఏమి నీ అహంకారము ఈ ఖడ్గముతో

బుద్ధు : సంకోచ మెందుకు నా హృదయము మీ ఖడ్గము నాహ్వానించుచున్నది

చక్ర : ఏమిటి? నా కనుల చీకో కాంతి

బుద్ధు : మరల ఆలోచన ఎందుకు? ఇదిగో నా శిరస్సు

(పాజ్)

బుద్ధు : ఇదేమి ప్రభూ ఒక సామాన్య భిక్షుకుని పాదాలపై మహాచక్రవర్తి, ఛటు లేమను కొనెదరు సామ్రాట్

చక్ర : ఇవి పాదాలు కావు. జ్యోతిబింబాలు

బుద్ధుకు : నేను భిక్షుకుణ్ణి ప్రభూ!

చక్రవర్తి : కాదు. విశ్వదాతవు నువ్వు ప్రభువు నీవు! ఏది ఆ విమలనయనాల నొకసారి చూడనిమ్ము స్వచ్ఛదర్పణములై నా వికృత స్వరూపాన్ని నాకు చూపిస్తున్నయ్. క్షమించు నా అత్యాచారం

బుద్ధుడు : అదిగో అటు చూడు పీడిత ప్రాణు లెలా ప్రణాకులై వస్తున్నారో

చక్రవర్తి : వారి శతకోటి కంఠాలనుంచి వెలువడే ఆక్రందనలకన్న పెక్కు పెట్టున ప్రతిధ్వనిస్తున్నది; అంతరాత్మయొక్క దుఃఖారావము..

* వేలూరి శివరామశాస్త్రి చంద్రశేఖరంగారి 'కాంచనమాల' నుండి

మెదలోని అంగుళీమాల అగ్నికణాలయి అణువు అణువును దహిస్తోంది ఈ హింసోన్మాదానికి మార్గం లేదా ప్రభూ!

బుద్ధుడు : బౌద్ధజగమున కావులేని ప్రాణి లేదు. ఏ గడపకద్దైన తిరస్కార ముండదు గాక కాని కరుణాదేవిఇంటికద్ద ఆహ్వనము తప్ప తిరస్కారము లేదు అహింసా పరమో ధర్మః, ఇదే జీవిత పథం

* "ఆ లుంబిని ఉద్యానాముంబున
వెలసిన యీ విమలజ్యోతికి,
నిరతము చేసెను నీ హృదయంబున
జయమని ప్రమోగుత ఓ జగమా!
జన్మవ్యాధి జరామృత్యువుల
బారగ ద్రోలెను బాటను జరిపిన
కరుణామయ శ్రీ గౌతమ దేవుని
చరణము లంటవె యో జగమా!
శ్రీ మహా శ్రీమూర్తికి జేజే!
అష్టాంగిక పథవర్తికి జేజే!
ధర్మచక్రప్రవర్తక! జేజే!
కర్మచక్రనివర్తక! జేజే!"

* * *

మొదటి వ్యక్తి : ఏమిటీ కోలాహలం

రెండవ వ్యక్తి : పరుగులెత్తుతున్న జనం ఎవ్వరు

మూడవ వ్యక్తి : ఎవరా సైనికదళం

4 వ వ్యక్తి : అదా ఇక్కడి చిత్రవధ పురుటిళ్ల దూరి పసికుర్రల దంపుట

5 వ వ్యక్తి : శిశుహత్య ఎవ్వరి రాక్షసమో

6 వ వ్యక్తి : బిగ్గరగా అనకు

8 వ వ్యక్తి : పసిపసిలైన శిశువుల దంపటమే వీరి సాహసకృత్యం

4 వ వ్యక్తి : సౌకోడు ప్రభువు చేసిన కఠోర ఆజ్ఞ

8 వ వ్యక్తి : తను మరణశిక్ష విధించిన వాడు తిరిగి జన్మిస్తాడని అతని భయం అందుకనే కళ్లు తెరవని పసిపాపలను సైతం చంపిస్తున్నాడు.

(సైనిక కోలాహలం విశృంఖలం పసిపిల్లవాని ఏడుపు )

ఆ తేలమంది' శుభం— శుభం... (పరిమ పవిత్ర పథమునా [illegible]

జన్మించే మహామహోత్తం సాక్షాత్తు ఈశ్వరుని పుత్రుడు

మొదటివ్యక్తి—ఎవ్వరది

2 వ వ్యక్తి : అతను కాలోడు దురంతకుల కందక అశ్వాలలో జనియించిన ఈశ్వర పుత్రుడు

3 వ వ్యక్తి : ఏమీ ఆ ముఖ వర్చస్సు ప్రేమ మయూఖు ఆకాశంలో ఒక చంద్రుడే అదీ ఉన్నవాళ్లు మురల ప్రవాహం

4 వ వ్యక్తి : కాని ఈ యువకుని విశాలనయనాల్లో వేయి చంద్రులు చల్లని వెన్నెల కురిపిస్తయ్

5 వ వ్యక్తి : వృద్ధులు, స్త్రీలు, యువకులు అందరూ అతని దగ్గరకు వస్తారు తమతమ బాధలను విన్నవిస్తారు

6 వ వ్యక్తి : ఇప్పుడు మన వాళ్లకున్న కొట్లాటలు లేవు

7 వ వ్యక్తి : నీపై గౌరవము చూపినవారిపై గౌరవం చూపటం లోకానికి క్రొత్తకాదు కాని నీ శత్రువులనుకూడా ప్రేమించమని చెప్పుతున్న ఈ యువకుడు విశ్వగృహంలో క్రొత్త జ్యోతి

* * *

ఒకరు అదిగో అటు ఆమె

ఇంకొకరు ఎవరు ?

ఒకరు ఏవరేమిటి ? భ్రష్టురాలు

మరొకరు పతిత

ఇంకొకరు కులట

ఇంకొకరు చూస్తారేం ఆ నీతిభ్రష్టురాలు నడివీధిలో వస్తుంటే

ఒకరు రాళ్లుకొట్టండి

ఇంకొకరు : విసరండి రాళ్లు

ఒకరు : ఏం ఆగారేం ? విసరు

ఇంకొకరు : అదిగో కాస్తలో తప్పింది గాని లేకపోతే అతనికి తగిలేది

ఒకరు ఎవరు? మన ప్రభువు. అక్కడ ఆమెకెదురుగా నుంచున్నది మన ప్రభువు

ఇంకొకరు : మన శిక్షాకాండకు, బెదిరింపులకు లక్ష్యం చేయటంలేదు. ఆమె చూడు

మరొకరు అతని పాదధూళిని ముద్దిడుతోంది.

ఒకరు : కళంకాల్పాదితమైన ఆమె ముఖం ఎంత వివర్ణంగా ఉంది...

మరొకరు అహో వారిద్దరి చుట్టూ జ్యోతి చక్రము నృత్యం చేస్తోంది. శుభస్పర్శలో పాపం తప్తమైంది

ఒకరు పాపం? ఇంతకన్న పాపం ఏముంది? మనము రాళ్లతో ఆమెను హత్య చేసేవారం

మరొకరు ఆమె ఆమె దోషి మనము న్యాయమూర్తులం కాని మనలో దోషరహితు లెవ్వరు?

ఒకరు ఎవరున్నారు దోషరహితులు? దోషాన్ని ముట్టని మనస్సు ఏది?

మరొకరు ప్రభూ! ఆమెను కాదు మమ్ము ఉద్ధరించింది అల్పులైన మనుష్యుల్ని లోకానికి నీకు విధించదలచుకున్న మాకు ఆత్మజ్ఞానం ప్రబోధించిన అమరజీవి! నీతో విశ్వమంతనూ ఏక గృహంగా నిర్మిస్తాం

కులట ఓ జగత్ప్రభూ! ఈ సంధ్యాపుష్పాన్ని కూడా నీ పూజకు తీసుకున్నావు

* * * *

కథకుడు ఈ ప్రేమ మూర్తి పాదము మోపిన చోటల్లా పాపం పశ్చాత్తాపంతో పునీతమైంది దుఃఖం కన్నీరు తుడుచుకుంది కాని మనుష్యునికి విధికన్న బలీయమైన శత్రువు మనుష్యుడే తనలో మండే ప్రేమ ద్వేషాల సంఘర్షణ ఈ రెంటి మధ్య మోహం గూడుకట్టుకుంది ద్వేషం కన్న కూడ మోసం మనుష్యుని శోధ కెక్కువ కారణం

ఒకరు : జూడాస్ వాళ్లలో ఆ ఈశ్వర పుత్రుడు ఎవరో మాకెలా తెలుస్తుంది.

ఇంకొకరు జూడాస్ ఇన్నేళ్లుగా నువ్వతని నమ్మిన బంటుల్లో ఒకడివిగదా ఇప్పుడీ కుట్రలో

జూడాస్ : నేను ఎవ్వరిని ముందుగా కౌగిలించుకొని, ముద్దుకుంటానో అతడే ఈశ్వర పుత్రుడు

ఒకరు ముద్దుతో ప్రేమను మోసగించటం. ఇంతకన్న .

జూడాస్ : వెంటనే నిర్బంధించి, న్యాయాధికారి వద్దకు తీసుకువెళ్లారి

* * * *

న్యాయాధికారి : ఎవ్వరిదీ? ఏమి నీ చేష్టలు..

ఒకడు: ఈశ్వరపుత్రుడనని చెప్పుకొంటున్న ద్రోహి

న్యాయాధికారి: ఇతనేనా ఈశ్వరపుత్రుడు

ఒకడు: పలుచోట్ల కుతకిచే చేస్తున్న దుర్మార్గ

అందరూ: ఈ మహాపరాధానికి శిక్ష మరణమే

ఒకడు: పైలేట్! రాజద్రోహి ఇతడు

పైలేటు: ఎవరితడు? ఇతని అపరాధ మేమిటి?

అంతా: జాతిని తన బోధలతో భ్రష్టు పరుస్తున్నాడు. చక్రవర్తి సీజరుకు సుంకం చెల్లించవద్దని వారిస్తున్నాడు

ఒకడు: ఇతడు తనే ఈశ్వరపుత్రుడనని చెప్పుకుంటున్నాడు యూదుల చక్రవర్తినని విర్రవీగుతున్నాడు

ఇంకొకడు: అది అన్యాయం అనకొక్కి కోపణ తాను ఈ రాజ్యానికి ప్రభువునని ఎప్పుడూ చెప్పుకోలేదతను అతని సామ్రాజ్యము ఈ లోకాలకు చెందినది కాదు అంతరాత్మల అనంత సామ్రాజ్యమునకు అతను ప్రభువు ఇదీ నిజం ఇదీ సత్యం

పైలేటు: సత్యమంటే ఏమిటి?

(నిశ్శబ్దం)

పైలేటు: ఇతనిలో నాకు దోషమేమీ కనపడ్డంలేదు

అందరు: ప్రజల నుద్రేకపరిచి, సంచలనం తెస్తున్నాడు

పైలేటు: అన్నట్లు ఇవ్వాళ ఉత్సవపు రోజు కదూ! మరి ఈనాడు ఒక నిర్బంధితుని విడుదల చెయ్యాలి కదూ ఈ యువకుడిని

అందరూ: వద్దు, వద్దు ఇతన్ని విడుదల చెయ్యవద్దు బారబ్బాస్ దొంగల నాయకుడు అతడు ఎరిగున్న దొంగ ఇతడు అద్భుత వ్యక్తి! బారబ్బాస్‌ను విడుదల చెయ్యండి.

పైలేటు: ఇతన్నేం చేసేది?

అందరూ: సిలువమీద మరణం అదే తగిన శిక్ష. (ఉద్రేకపు గొంతుతో)

* * *

పైలేటు: సిలువమీద మరణం. ఏం చెయ్యని చేశాడని అతనికీ ఘోరశిక్ష!

అంతా: సిలువమీద మరణం. ఈశ్వర పుత్రునికి మరణశిక్ష

ఒకడు: కృశించిన ప్రేమమూర్తి. సిలువ మోయలేక పోతున్నాడు

ఇంకొకడు: మనందరమూ చేస్తున్న ఈ మహాపాపానికి రవ్వంత ప్రాయశ్చిత్తము. నేను మోస్తాను సిలువను

* * *

ఒకడు: మరి రెండు సిలువలున్నవి

ఇంకొకడు: ఇద్దరు దొంగలకు కూడా ఇవ్వాళ మరణశిక్ష

ఒకదొంగ: ఈశ్వర పుత్రుడుకూడా మన దగ్గరకే వచ్చాడు ఓ ఈశ్వరపుత్రుడా, నువ్వే ఈశ్వర పుత్రుడివయితే, నిన్ను రక్షించుకుని, మమ్మల్ని కూడా రక్షించు

రెండవదొంగ: ఛీ, సిగ్గులేదురా నీకు, మనం చేసిన పాపకృత్యాలకు ఈ శిక్షలు మనకు సహజమే కాని ఇతను సర్వమూర్తి ప్రేమమయుడు ఓ ప్రభూ, నువ్వు నీ సామ్రాజ్యంలో అడుగు పెట్టినప్పుడు ఈ పాపిని కూడా గుర్తుంచుకో!!

కొందరు: ఈశ్వర పుత్రుడు, విమోచకుడట, అయితే ఆ ఈశ్వరుడు వచ్చి, ఈ కొడుకుని రక్షించడేం?

ఆకాశవాణి: ఓ విశ్వేశ్వరా, వీరు నిరోధులు కాని వారిని క్షమించు ఇదే అతని కోర్కె. వారు అమాయకులు. వారేం చేస్తోంది వారికి తెలియదు

* * *

హింసా విహారి మనిషి
జనహింసా విహారి మనిషి!
పరహింసా విహారి మనిషి!

ప్రేమమూర్తులను
హననము చేసి
ద్వేషాంధుడవౌ మనిషీ!
సత్యమమరము, ప్రేమ అమరము!!

రక్షకుడు ఎవరు, మన విమోచకులో వారిని హింసించటం మన సంప్రదాయం... కాని మహాత్ముల సందేశం అమరమైనది తేజోవాహా

దీపాన్ని ఆర్పుకొని, మళ్ళీ ప్రజలు వెలుగుకోసం వెతు కుస్తారు

*ఎంతకాలమ్మయుండిరో రొంచుచున్న
వెలుగుపాడ తెంచి కూడపు వీధియందు
విక్రమించి జగంబెల్ల నాక్రమించె
విశ్వపద్మంబు రేకులు విచ్చ

ఒకరు ఎవరిది ?

ఇంకొకరు ఎవరది ఒంటరిగా, నిర్భయంగా కీకారణ్యంలో వెళ్లేది ? చేతిలో చిరు ఆయుధం కూడా లేకుండా ?

ఒకరు వీరి! తనపు మబ్బులేని నిర్మలముఖం, ఏదో బ్రహ్మ తేజస్సు! వనమృగములకన్న హింసా త్మకమైన ప్రవృత్తులావేశించిన జనసమూహముల మధ్య ఎలా నడచి పోతున్నాడు

ఒకరు దూసిన కత్తుల మరల ఒరల నిడు చున్నారు—వెలిగించిన జ్వాలలను మరల చల్లా ర్చుతున్నారు

ఇంకొకరు చూడుడు చూడుడు ఇది భ్రాంతా ? నిజమా ? కత్తియలపై కత్తులు దూసు కున్న కఠినులు ఆ మహాత్ముని నీడలో కొగలించు కొనుచున్నారు

ఒకరు అహా! ఎన్నియుగాల కీ పృథ్విపై ఈ పవిత్ర పాద చిహ్నాలు

హంతకుడు ప్రేమయను పేరిట, జరిగిన అవమానములకు తలొగ్గము నే ఈ మహాత్మునకు దేశాని కరిష్టము ఈ వార్ధక్యంలో కూడా తన కర్తవ్య అద ర్శాన్ని విడనాడని ఈ వృద్ధుని రంగంలోంచి తొల గించటం నా విధి.

అందరూ మహాత్మునికి అభివందనాలు

జై జై జై

హంతకుడు ఓహ్; ఎంతమంది వందలు వేలు. లక్షలు అశ్రువాహినులన్నీ ఇచట సము ద్రమై, ఈ వృద్ధుని ముంచివేయగలవని భ్రమించాను. కాని తమ అశ్రువులతో ఆ పాదములను కడుగుతు న్నారు

---

*వేలూరి శివరామ శాస్త్రిగారి 'ఏకాంకి' నుంచి.

స్త్రీలు మహాత్ముని నేత్ర ద్వయమునుంచి కరుణావాహినిపొంగిపొరలుతోంది. పతితులం అనాథలం ఆర్తులం మా బోటోళ్ల మహా త్మునికి

హంతకుడు వీరి అక్రోశమేమైనది? వీరి భగ్న హృదయాల విషపూత్కారమేది? నాతను ఇంద్ర జాలికుడు వారి మతులను వారు విస్మరిస్తున్నారు

అందరూ మహాత్మునికి అంజలులు! ఇట్లు దగ్గ రమైనవి అస్త్రలు మాకులేవి కాని ఓ భగవం తుడా! ఈ పుణ్యాత్ముని మాకు దక్కనివ్వు

హంతకుడు ఎవరి దైన్యం, కష్టాలు నన్ను ఘోర, అపతిక్రమ్య కృత్యానికి పురికొల్పుతు న్నాయో, వారే ఏమ్చులాకి, కన్నీరు కురుచుకొని, అతని పాదధూళి చల్లుకుంటున్నారు ఈ లక్షల మందిలో నాకేని ఒక్కరూ తిరగరు

అందరూ అదిగో మహాత్ములు వస్తు న్నారు ఇప్పటికే కొంచెం ఆలస్యమైంది

కొందరు వుండండి నిశ్శబ్దంగా వుండండి

హంతకుడు అహ్ ప్రభాత సూర్యునిలా కాదు అస్తమయ సూర్యునిలా ఏమి తేజస్సు కావచ్చు దివ్యతేజస్సు అహా! నా చేతులు పట్టు పడలినవి ఏమిది ప్రణామము మహాత్మా మీ కాలస్యంగా వస్తున్నారు మీ సమయం దాటింది

(పిస్టలు పేల్చ బడ్డాడు)

అందరూ ఆ! ఆ! ఏమిటీ ఘోరం

కొందరు మహాత్ముని హత్య!

ఒకరు ఎవరు ఎవరు ఈ హత్య చేసింది!

ఒకరు ఎవరా దౌర్భాగ్యుడు?

హంతకుని తల్లి · బిడ్డా! ఏం చేశావు నువ్వు?

(విచారపు, ఏడుపు గొంతుకలు)

కథకుడు హంతకుల నిరంతర శ్రమ హత్యతో భారాన్ని దింపగలమని ఈ దుష్టాంతకు లోనైన తమ జీవితాలను తాము కలుషితం చేసుకుం టారు ఆ వెలుతురు వాళ్ళాపుకుంటారు కాని ఒక్క దిక్కున వెలుగుతున్న ఆ జ్యోతి దిక్కు ప్రకాశము ఆకాశమంతటా నలుదిక్కులా వ్యాపిం

చింది. ఇదివరకు ఈ లోకం బింబంపైళ్ళు చూడని, కళ్లు కోటానుకోట్లు ఇప్పుడీ జ్యోతి వెలుగులో చీకట్లను పోగొట్టుకుంటాయి

సూర్యచంద్రాదులూ
వెలుగునందాక
ఆరిపోదీజ్యోతి,
అమర, నిర్మలజ్యోతి,
అదిగదిగో అంతరాకాశ వీధిలో
ధృవతారలా వెలుగు ధర్మనిర్మల జ్యోతి
జ్ఞాన అన్వేషణే
నిత్య, నిర్మల జ్యోతి!

* * *

విభిన్న భావులారా! హింస నశలంబించి, ఇంక మానవ చరిత్రను రక్తసిక్తం చెయ్యకండి వచ్చింది, వెలుగుయుగం తరలింది తమోయుగం... అదిగో బుద్ధవాణి!!

"అహింసా పరమో ధర్మః"

(ఆల్ ఇండియా రేడియో సౌజన్యంతో, జనవరి 80వ తేదీన మద్రాసు రేడియో నుంచి ప్రసారితమైన నాటిక)



# ఉగాది వందనము

★

శ్రీ పెనుమర్తి కామేశ్వరరావు

ముందు లుండిన నేమి మురువొప్ప లావణ్యశోభతో నిచ్చె గులాబికన్న
దంపతీ ప్రేమలో ధావళ్యమును దెల్ప విరియబూచెను తోట విచికిలమ్ము
కోకిలానీకపు గొంతు చెఱను బాప కల్లవామృతమును బట్టె మావి
ప్రణయగీతమ్ములు పాడుచు మధుపూరసుమముల ముద్దాడి చొక్కె నళులు
త్రిభువనోద్దీపకుఁడు ప్రకృతిని వరించి కొలువు దీర్చె వసంతుఁడీ తెలుగుభూమి
సాంద్రవైభవవశులు, నిస్తంద్రయశులు-ఆంధ్రుల కుగాది కుతుకపు చంద్రమయ్యె!

వేలు సేయఁగఁబోయి కాళగళుని కంటివేడి మాడిన రతిప్రియుని సేవ
అమృతమ్ముకొఱకు క్షీరాబ్ధిని మథియించి కరకరులగు సురాసురుల తీరు
విప్రబలంబున వృద్ధిపొందిన బలిఁ బాతాళమున కంపు వటువు ప్రతిభ
బడుగు కుచేలుని యిడుములు వాపిన దీనబాంధవుని దాతృత్వమహిమ
తెలుఁగుదేశాన నెల్లెడ వెలుఁగుచుండఁ గలిగె నందన సంతోషకలితయగుచు
ఎల్ల ప్రజకు సౌఖ్యము నావహిల్లఁజేసి తల్లిమైఁ బ్రోచు సుతుల సంపుల్ల మతిని

జీవితమ్మున తీపియు చేదు కలిసియుండు ననుమాట జ్ఞప్తియం దుండుకొఱకు
వేపపూల పచ్చడిఁ దిని పూపవయసు బాలబాలిక లుత్సాహపొల నూఁగ!

భారత భారతీచరణపంకజముల్ భజియించు సత్కవీ
ధీరులఁ బెంచునందనల తీరున నందముఁ గ్రుమ్మరించుమా!
కూరిమినందనా! సుగుణకోమలభావుకు లాంధ్రపుత్రులన్
చేరువుగూర్చి మమ్ము గరుణించుము మంచితనమ్ము పెంచుచున్.

పోటరులైన యాంధ్రులకుఁ బొత్తు పశీర్ణము, నైన్యలాభమా
ఖేటమునై, సమిష్టికృషికిఁ బలిమై, మహాంధ్ర రాష్ట్రమున్
బాటిలలేదు స్పర్థలకు భాజనమై, తమలోనఁ దాము గ
య్యాటము లాడుకోగలుగ అందనిమ్రాని ఫలమ్ము గాదొకో!

స్వార్థరహితులు, మహితస్వవ్రతులు, హితులు రాజకీయ ధురంధరులై జనాళి
ప్రేమఁబొందఁగ ఐక్యత పెంచుకొనుఁడు, రాష్ట్రము లభించు, పారతంత్ర్యము నశించు!
నందన సంవత్సరమా! వందనమును గొని మహాంధ్రవత్సలవై యా
[illegible]గము నొసగెడి రాష్ట్రము బొందగ దీవించు మమ్ము! భూపింత్రు జనుల్.

---

# జగన్నాథపండితరాయలు

## విద్వద్వాగ్గేయకారుడు

★

శ్రీ కోవ వెంకటరాయశర్మ

మనము సామాన్యముగ బూర్వుల గుణ దోషముల దెలిసికొని సమదృష్టితో వానిం దెలిసికొనలేక పోవుటయు, మన యిప్పటి స్థితికి సంబంధించిన కార్యకారణ సంబంధ మరసి దానిం దొలగించుటకు దగు సాధనాంతరముల నన్వేషింపకుండుటయు, —గారణములుగా బ్రసిద్ధపురుషుం డగు జగన్నాథ పండితరాయల గుఱించి తెలిసికోజాలకున్నారము

ఇమ్మహాభాగుడు విరచించిన 'ప్రాణాభరణ' మను గ్రంథమునం గల—

"తైలంగాన్వయ మంగళాలయ మ
హాలక్ష్మీ దయా లాలిత,
శ్రీమ త్పేరమభట్ట సూను రని
శం విద్వల్లలాటం తపః
సంతుష్టః కమఠాధిపస్య కవి
తా మాకర్ణ్య తద్వర్ణనం,
శ్రీమ త్పండితరాజ పండిత జ
గన్నాథో వ్యధాసీ దిదమ్"

"పాషాణా దపి పీయూషం
స్యందతే యస్య లీలయా
తం వందే పేరుభట్టాఖ్యం
లక్ష్మీకాంతం మహాగురుమ్"

—అను ప్రస్తావములబట్టి పండితరాయలు లక్ష్మీదేవి—పేరుభట్టుల గర్భశుక్తి ముక్తాఫలంబని తెలియందగును వెగినాటి బ్రాహ్మణుడు '<u>ఉపద్రష్ట</u>' గృహనామముగా గలవాడు తూర్పుగోదావరీ మండలములోని 'ముంగండ' అగ్రహారము నివాసము అనగా 'కోనసీమ' వాస్తవ్యుడు

ఇతడు జ్ఞానేంద్రు నొద్ద నుత్తర మీమాంసను, ఖండదేవు నొద్ద బూర్వమీమాంసను, మహేంద్రుని దగ్గఱ న్యాయ వైశేషికములను, వీరేశ్వరుని దగ్గఱ వ్యాకరణమును—అభ్యసించి సర్వవిద్యాపారంగతుం డయినట్లు '<u>రసగంగాధర</u>' మందలి—

"శ్రీమద్ జ్ఞానేంద్రభిక్షో రధిగత
సకల బ్రహ్మవిద్యాప్రపంచః,
కాణాదీ రాక్షపాదీ రపి గహ
నగిరో యో మహేంద్రా దవేదీత్,
దేవాదేవా ధ్యగీష్ట స్మరహర
నగరే శాసనం జైమినీయం,
శేషాంకప్రాప్త శేషామలభణి
తి రభూ త్సర్వవిద్యా ధనో యః"

—అను వాక్యముంబట్టి విదితము కాగలదు ఈ విషయమున నితడు '<u>భామినీ విలాసము</u>' లో—

"ఖంధః పరిమిత మంధః పిబతి
సహా కుంభసంభవోంభోధిం,
అతిరిద్యతే సుజన్మా కశ్చి
జ్జనకం నిజేన చరితేన"

—అని వ్రాసియుండుటవలన, బట్టెడంత జలముసే కుండ త్రాగునదియు, గాని కుండయం దుద్భవించిన యగస్త్యుడు సముద్రము నంతను హాపోశనము పట్టినాడనియు నటులనే లోకములో నొకానొకడు తన నిస్తుల ప్రతిభా వ్యుత్పత్తులచే దండ్రి నధిగమించుననియు,—తెలియందగియున్నది. ఇతని "<u>రస గంగాధరము</u>"న ధీరత్వ, పాండిత్య, కవితా శూరత్వములు మాత్రమే గాక ధర్మశాస్త్రము, సర్వదర్శనములు,—ఇవి యవి యననేల అన్ని విషయములు వెలయేర్లవలె బఱుగువాఱి వచ్చి పడినవి పాండిత్యమును బ్రస్తావించునపుడు "<u>రస గంగాధర</u>" మందలి

"అపి వక్తి గిరాంపతిః స్వయం
యది తాసా మధిదేవతాపి వా
అయ మస్మి పురో హయాననః
స్మరణోల్లంఘిత వాఙ్మయాంబుధిః"

—అను వాక్యము లక్ష్యసిద్ధిగా నగపడుచున్నది. ఇక కవితా ధీరత్వమును.

"ఆమూలా ద్రత్న సానో ర్మలయ
వలయితా దాచ కూలా త్పయోధేః,
వాదీక త్వ స్నతి కోప్యప్రణయన
పటుత స్తి విశంకం వదంతు,

## కులంలేని పిల్ల

[సాంఘిక నాటకం]

పినిసెట్టి శ్రీరామమూర్తి ఆదర్శ నాట్యమండలి, పాలకొల్లు వెల రూపాయి పావలా

ఇది వర్ణవిభేదాలు కూడదని నిరూపించే నవీన నాటకం రచయిత అక్కడక్కడ పాటలు కూడా ప్రవేశపెట్టారు పాపన్న పంతులనే ఛాందసు డుంటాడు అతని కుమారుడు సుదర్శనం సుశీల అనే కులంలేని పిల్లను పెళ్ళిచేసుకుంటానని పట్టు పడ తాడు తండ్రి వల్లకాదంటాడు చివరికి కొడుకు తండ్రికి ఎదురుతిరిగి సంఘోద్ధరణాదర్శంతో తాను వలచిన పిల్లనే పెళ్లిచేసుకుంటాడు

ఇది ఇలా ఉండగా సుదర్శనం చెల్లెలు విమల సువర్ణనం బావమరిది వీరేశుని పెళ్లిచేసుకోవాలని అనుకుంటుంది

పాపన్న పంతులు కొడుకు చేసినది అంగీకరించి నట్లు నటించి, ఒకనాడు హఠాత్తుగా కొత్తగా పుట్టిన శిశువును హత్యచెయ్యబోతాడు కాని సుశీల అడ్డు కుంటుంది చివరికి కత్తిపోటువల్ల సుశీల చచ్చిపో తుంది ఇది జరిగిన తరవాత పాపన్న పంతులుకు పశ్చాత్తాపం వస్తుంది చివరికి విమలా వీరేశుల పెళ్లితో నాటకం ముగిసిపోతుంది

కథ అల్లికనుబట్టిచూస్తే నాటకం చివర ఇల్లాటి అఘాయిత్యం అక్కరలేకుండానే పంతులులో పరివర్తన తీసుకురావచ్చును మొత్తంమీద ఇల్లాంటి లోపాలు నాటకకథలో అంతటా కనిపిస్తాయి

పాత్రస్వభావాలను గురించిగాని లేక ఈ నాటకంలోని పాటలను గురించిగాని అంతగా వ్రాయవలసిందేమీ లేదు

ఈ నాటకంలో ఒక్క సంభాషణలు మాత్రం కొంచెం చురుగ్గా చలాకీగా సాగిపోతూంటాయి ఈ వీటివల్లనే పాఠకులీ నాటకం కొసదాకా చదువుకోవడానికి వీలవుతుంది

---

## ప్రగతి

[నాటికల సంపుటం]

ఆచార్య ఆత్రేయ, ఉదయసాహితి, గవర్నర్ పేట, గుంటూరు వెలముప్పావలా

ఇది రెండు నాటికలసంపుటి. దీనిలో మొదటిది *'Progress'* అనే ఆంగ్లనాటిక మొదటి పది పేజీలు, చివరిపేజీ చదివినతరవాత వ్రాసినదని ఆచార్య ఆత్రేయ పీఠికలో తెలియజేశారు. రెండవది కావలానాదీపం. ఇది హరీంద్రనాథ చటోపాధ్యాయ వ్రాసిన నాటికకు అనువాదం

ఒక శాస్త్రపరిశోధకుడు గట్టిపరిశోధన చేసి ప్రపంచం అంతా భస్మీపటలంచేసే మారణా యుధం కనిపెడతాడు అఖండంగా ప్రపంచంలో యుద్ధాలు లేకుండా చేయ్యవచ్చునని అతననుకుం టాడు కాని అతని సోదరి శాంతి ఆ చేసేదిరాక్షస కృత్యమని నిందిస్తూ పరిశోధనాగారంలోని వస్తువు లన్నీ విరజిమ్మి పారేస్తుంది ఇదీ ప్రగతిలోని కథ

ఈ నాటిక చాలా మంచి నాటిక కాని అను వాదకులు యథాతథంగా అనువదించక పోవడంవల్ల తెలుగు నాటిక చప్పగా తేలిపోతుంది దీనికి పూర్వమే ఏ తరాలో తెలియదుగాని శ్రీ మొక్కపాటి నర సింహశాస్త్రిగారు దీన్ని అనువదించిప్రదర్శించారు. ప్రదర్శనలోకూడా ఆనాటిక బాగా రక్తికట్టింది ఇల్లాంటి ఉత్తమనాటికలు అనువదించేటప్పుడు అను వాదకులు తగినంత శ్రద్ధతీసుకోకపోతే — చివరికి మూల రచయితకే అన్యాయం జరుగుతుంది

ఇక రెండో నాటికలో అనువాదం చురుకైన సంభాషణలతో సాఫీగా చక్కగా నడిచిపోయింది

---

## శైవ సర్వస్వము

పండిత ముదిగొండ కోటయ్యశాస్త్రి అయ్యవారు. ఈమని వయా దుగ్గిరాల, గుంటూరుజిల్లా వెల 3-8-0

ఇది శైవుల ఆచారవ్యవహారాలు, ధర్మాధర్మాలు, శైవవేదాంతము మొదలయిన విషయాలను గురించిన గ్రంథము రచయిత ప్రమాణపరిచ్ఛేదము అనేవిభాగంలో శాంభవదీక్ష స్వీకరించే విధానము, సప్రమాణంగా వివరించారు

దీనిలో రెండోవిభాగం ఆచరణాచారదీపిక దీనిలో రచయిత భస్మధారణాది విధానాలన్నీ విపులంగా వివరించాడు

అటుపిమ్మట శాంభవీయ ధర్మసూత్రావళి విభాగంలో శైవధర్మసూత్ర గ్రంథాలనుండి సేక రించిన ప్రామాణిక సూక్తులతో శైవధర్మాలనుగూర్చి చేసిన కూలంకషచర్చ కనిపిస్తుంది నాలుగవది చారిత్రికమైన శైవజ్యోతి అనే అధ్యాయము రచ యిత దీనిలో సంగ్రహంగా శైవమతచరిత్ర వ్రాశారు

అయితే ఇది మొట్టమొదటే చేర్చిఉంటే పాఠకులకు ఈ గ్రంథం ఇంకా సులభసాధ్యంగా ఉండేది. మున్ముందు సంస్కృతశ్లోకాలు మొదలైనవి



# ఆనందమయమైన గృహజీవనం

అతని ముఖం ఆనందముతో ప్రకాశిస్తున్నది ఆమె ప్రేమతో తయారు చేసిన 'టీ' ఒక గ్లాసు త్రాగడం అప్పుడే ముగించాడు పగలల్లా ఆఫీసులో పనివల్ల వచ్చిన అలసట పూర్తిగా అదృశ్యమైపోయినది ఇక ఇప్పుడు అతడు చేయవలసినది కులాసాగా భార్యతో కబుర్లు చెప్పడం పిల్లలతో ఆడుకోవడం

ప్రతిసాయంత్రమూ ఒక గ్లాసుడు టీ తో భర్తను ఆహ్వానించి అతనిని ఆమె సేద దీరుస్తుంది సుఖమయమైన సంసార జీవనం గడపడానికి అతనికి అంతకంటే ఏం కావాలి ? ఉల్లాసాన్నిచ్చే మంచి 'టీ' తయారు చేయడం ఎంత సులభం ! ఇక ఖర్చు విషయమా అదీ స్వల్పం. వ్యవధికూడ ఎక్కువ అక్కరలేదు

సేద దీర్చే రుచికరమైన 'టీ' ని ప్రతి రోజూ త్రాగండి.

## మంత్ర శక్తి నిచ్చే పానీయం
## "టీ" త్రాగండి



సెంట్రల్ "టీ" బోర్డువారివల్ల ప్రచురింపబడినది.